భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ రష్యా, ఐరోపాల పర్యటన సందర్భమున రోము నగరంలో శ్రీమతి ఇందిరా గాంధీతో కూడా మధ్య, దూర ప్రాచ్యప్రాంతీయ సంఘమును సందర్శించినప్పుడు మైనపువత్తులుంచు చట్టము బహూకరించబడినప్పటి చిత్రము.



కైరళి జనకీయ కళాసమితివారి అధ్వర్యమున నృత్య ప్రదర్శన మొనరించిన ఎ త్రిరాజ్




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక


వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

అక్టింగ్ ఎడిటర్
సి. సి. వున్నయ్య



సంపుటము ౨౮] సెప్టెంబరు 1955 [సంచిక ౯






# విషయసూచిక



ఉమా, సుతులు




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## గోవా

గోవాసమరం ఒక్క హిందూదేశములోని పోర్చుగీసు ప్రాంతాల వారికి మాత్రం సంబంధించినదనుకోడం పొరబాటే కావచ్చును. కాని ఏ స్వాతంత్ర్య ఉద్యమమయినా స్థానికప్రజా చైతన్యము, సమైక్యత, త్యాగము, పోరాటము ననుసరించినవే బయటివారి సహాయ సహకారాలు అయి యుండాలి. స్థానికంగా జరిగే పోరాటంలోనైతేనేమి, ఇండియా ప్రజల సహాయ సహకారాలయితేనేమి సమర్థమయిన నాయకత్వము క్రింద, నిర్మాణయుక్తంగా జరుగాల్సినవి కాని ఉద్రేకపూరితంగా, అరాజక చర్యలతో సాధించకలిగేది వాంఛనీయంకానేరదు.

ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాదానికి శాశ్వతగోరీలు కడుతుంటే పోర్చుగల్ దేశము భారత భూభాగములోని కొన్ని ప్రాంతాలపై తమ ఆధిపత్యానికి ప్రాకులాడటం అవివేకం తప్ప మరేమికాదు. బ్రిటను, ఫ్రాన్సులాంటి అగ్ర రాజ్యాలే వాస్త

ధిక పరిస్థితులకు తలలొగ్గినవి. ఇక పోర్చుల్ ఏమాత్రము, ఎంతకాలము తమ ఆధిపత్యాన్ని ఇండియాలోని స్థావరాలపై నిలుపుకోవాలనో పాపం!

భారత ప్రభుత్వము, ప్రజలు పూనుకుంటే ఆస్థావరములలో పోర్చుగీసు ఆధిపత్యానికి స్వస్తి జరగడం ఎంతో సేపు పట్టదు. కాని అది ద్వేషతోటి, హింసాకాండతోటి కాక శాంతియుత మార్గాలలో, యావత్ప్రపంచ సానుభూతి సద్భావాలతో సాధించాలనేది జాతీయ నాయకత్వముయొక్క, భారత ప్రభుత్వము యొక్క లక్ష్యము. కాబట్టే ఆలిండియా కాంగ్రెస్ కమిటీ భారతీయ సత్యాగ్రహులు పోర్చుగీసు ప్రాంతాలలో ప్రవేశించడాన్ని నిరసించింది; ప్రభుత్వము నిషేధాన్నితలపెట్టింది.

గోవాసమరంలో పోర్చుగీసు ప్రాంతాలలోని సోదర ప్రజానీకపు స్వాతంత్ర్య ఉద్యమంలో తోడ్పడి పాల్గొనడానికి పోయినకొందరు సత్యాగ్రహులు అమరత్వాన్నొందారు. మరికొందరు యమయాతనలకు, హింసకు గురియయ్యారు. వారికి మా జోహారులు! వారి త్యాగము, పోరాటము పోర్చుగీసు యిండియాప్రజలకు ఆత్మ విశ్వాసంతో కూడిన చైతన్యాన్ని, ఉత్సాహాన్ని పురికొల్పుగాక! వారి వీరోచిత స్వాతంత్ర్య పోరాటానికి మార్గదర్శకమగుగాక!

ఈ సందర్భమున గోవా స్వాతంత్ర్యోద్యమానికి నవచైతన్యాన్ని, సాహస శౌర్యపరాక్రమముల పూరించగలిగిన శ్రీమతి సుభద్రాబాయి లాంటి వీరనారీతిలకముల ధైర్యసాహసాలు అభినందనీయములు.

# ప్రజలు — పన్నులు

అభివృద్ధి ప్రణాళికల నిర్వహణకు ప్రజలు పన్నుల భారం వహించక తప్పదు అనేది కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల అభిప్రాయము. కాని ప్రస్తుత ఆర్థిక దుస్థితి దృష్ట్యా పన్నులభారము వహించకలవారెవ్వరు? దైనికావసరాలకు సయితం అష్టకష్టాలు పడు

తున్నవారెవ్వరు? అనే విషయాలను వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా పరిశీలించి పీడిత ప్రజానీకానికి ఆదాయం పెరిగే మార్గాలను ఏ మాత్రం అన్వేషిస్తున్నవో అనూహ్యం.

ధనిక, శ్రామిక వర్గాల జీవిత సరళి చాలవరకు సుగమనంగానున్నదనే చెప్పాలి. ఇక మధ్య తరగతి వారి జీవితాలు మాత్రం దుర్భరంగా నున్నవనే విషయం పరిపాలకులు గుర్తించవలసిన ఆవశ్యకత ఎంతైనా యున్నది.

ఆస్తిపాస్తులులేని శ్రామిక వర్గానికి పన్నులభారంతో అంతగా నిమిత్తముండదు. ఉన్న మహారాజులు గరిష్ట ఆదాయంతో పన్నులు చెల్లించడానికాని, ఎత్తుకుపై ఎత్తు వేసి పన్నులు ఎగవేయడానికి గాని వెనుకాడరు. ఇకమిగిలింది కొద్దీ, గొప్ప ఆస్తులతో చాలీచాలని ఆదాయంతో దినగండం నూరేళ్లాయుస్సుగా జీవయాత్ర సాగిస్తున్న అధిక సంఖ్యాక మధ్య తరగతి ప్రజానీకం. ఇప్పుడున్న ఆర్థిక దిగ్బంధనతోనే గిజగిజలాడు తుండే మధ్య తరగతి ప్రజానీకాన్ని అదనపు పన్నుల భారం మోయమనడం అసందర్భమేకాగలదు.

ఈ సందర్భమున పరిపాలకుల కర్తవ్యం తేటతెల్లంగా కనుపిస్తూనేయున్నది- నయాన, భయాన జాతీయ సంపదను సమీకరించడం, దాన్ని యావత్ప్రజానీకపు శ్రేయస్సుకు వినియోగించకలుగడం, యోగ్యతల ననుసరించి చాకిరిచేయనుద్యుక్తులయిన వారందరికి జీవనోపాధి కలిప్పించడం అత్యవసరము. కుటుంబ జీవితంలో ఒకరు పనిచేస్తూ, అతని ఆదాయము మీద అనేకులు ఆధారపడటమనేది ప్రభుత్వముచే నిరుత్సాహం పర్చబడాలి.

ఉన్న అవకాశాలను శాయశక్తుల సద్వినియోగంచేసి ప్రజావసరాల కనుగుణ్యంగా పరిపాలనను కొనసాగించకలిగినదే ప్రజాపరిపాలన కాగలదు.



# బాబు

## శ్రీ ఆకెళ్ళ జానకిరామ సుబ్రహ్మణ్యం

జానికమ్మగారికి ఈరోజున చెప్పుకుని గర్వించతగ్గ ఆస్తేమీలేదు ... జీర్ణించిపోయి కూలిపోవటానికి సిద్ధంగావున్న ఒక్క కొంప, ఏదో సెకండ్ ఫారం చదువుతున్న ఒక్కగా నొక్క కొడుకు బాబుతప్ప.

జానికమ్మగారి పెద్దాడు, పదోఏటే, స్వగ్రామానికి గుడ్ బైకొట్టేసి, దేశంకాని దేశంలో తిరుగుతూ, తల్లికి మాత్రం కనపడకుండా తప్పుకుంటూవచ్చాడు... మొన్న మొన్ననే, తను మిలిటరీలో చేరినట్టుగా తల్లికి ఉత్తరం వ్రాశాడుకూడ. దానితో, జానికమ్మగారికి, పెద్దాడిమీదవున్న కాస్త ఆశకూడ వదులుకోవలసి వచ్చింది...ఇంక ఆశంతా ఒక్కగా నొక్క కొడుకు బాబుమీదే.

'వెధవకొంప ! ఈవేళవుంటుంది. రేపుంటుంది. మహా అయితే ఎల్లుండికూడ వుంటుందేమో ! నాలుగో రోజున గట్టిగా గాలివేసిందంటే, పునాదులతో సహితంగా కూలిపోతుంది. ఆరోజుతో దాని ఆయుర్దాయం పూడిందన్నమాటే. కాని బాబు అలా కాదు ... పెరిగి పెద్దవాడై, బాగా చదువుకుని ఓ పెద్ద ఆఫీసరు వుద్యోగంచేస్తూ, పదిమంది నౌకరుల చేత చాకిరీచేయించుకుంటూ, దర్జాగా కాలుమీద కాలువేసుకుని బ్రతకాలి. తను బ్రతుకున్నంతవరకు, బాబు జీవితాన్ని సంతోషంతో చూడాలి. తను చనిపోయిన తరువాతకూడ, బాబు సుఖంగా, శాశ్వతంగా బ్రతకాలి. గంపెడు పిల్లలు పుట్టాలి. వాళ్లందరు, పెరిగి పెద్దవాళ్లై, తను బాబు మార్గాన్నే తొక్కాలి. వాళ్ళందరితోపాటు తన బాబు ... ముద్దులబాబు, బంగారుబాబు, భోగభాగ్యాలతో తులతూగుతూ, ఈ లోకంలోనే, శాశ్వతంగా వుండిపోవాలి. తను మాత్రం ... పైలోకంనుంచి అప్పుడప్పుడుచూస్తూ, తన బాబును సంతోషంతో ఆశీర్వదించిపోతూవుండాలి. ...

ఈ విధంగా జానికమ్మగారు ప్రతీరోజు బాబును గురించి, మేడలు కట్టుకుంటూవుంటుంది. అందులో ఆశ్చర్యమేముంది? ఏతల్లి తన కొడుకు, ఆజన్మాంతం సుఖంగా వుండాలని కాంక్షించదు ? ... ఆమె కట్టుకున్న మేడలు గాలిమేడలుమాత్రం కావు. మంచి ఒకటోరకమైన కాంక్రీటు పునాదితో కూడుకున్న మేడలని చెప్పటానికి కావలసినన్ని తార్కాణాలున్నాయి.

ఇటు తన అత్తింటి వాళ్ళందరూకూడ, పెద్దపెద్ద చదువులుచదివి, గొప్ప గొప్ప వుద్యోగాలలో వున్నారు....అటు తన పుట్టింటివాళ్ళందరూ, అరవై నాలుగు శాస్త్రాలు నమిలివుమ్మేయగల సమర్థులు. ఇటువంటి వంశవృక్షంలో మాణిక్యంపుట్టక మట్టిబెడ్డ పుడుతుందా ? అలా జరగదన్న సంగతి ఆమెకు బాగా తెలుసు ... అందుకనే ఆమెకంతధీమా.

బాబు వయస్సు తక్కువైనా, తెలివితేటలనుబట్టి సెకండ్ ఫారంలో చేర్పించింది జానికమ్మగారు. మొగదిక్కు ఎవరూలేకపోవటంమూలాన, బాబు చదువు విషయమై తనే స్వయంగా అన్ని ఏర్పాట్లు చేయవలసివచ్చింది. పరీక్షకు కావలసిన పాఠాలన్నీ తెలుసుకుని, దగ్గరుండి చదివించి, సులువుగా సెకండ్ ఫారంలో చేర్పించకలిగింది.

తను చిన్నప్పుడు ఐదోక్లాసుదాకా ఎలిమెంటరీ స్కూల్లో చదువుకున్న చదువు, బాబుకు చదువు చెప్పటంలో బాగా ఉపయోగించింది. స్కూల్లో చెప్పిన ఇంగ్లీషు పాఠాలన్ని బాబుచేత ప్రతీరోజు క్రమం తప్పకుండా చదివించి, తనుకూడా గ్రహించి, అవసరంవచ్చినపుడు తను తిరిగి బాబుకు చెప్పగల శక్తిని సంపాదించింది. బాబు ఏకసంథాగ్రాహి ఏమో సెకండ్ ఫారంలోచేరటం అంటే పెద్దకష్టం అనిపించలేదు.

ప్రతీరోజు స్కూల్లో ఏంచెప్పేరో, బాబు సహాధ్యాయి, పక్కింటి శంకరాన్ని అడిగి తెలుసుకుంటూ వుంటుంది. ఆ చెప్పిన పాఠాలన్నీ ఏరోజు కారోజు, దగ్గరుండి చదివిస్తూ ఓవిధమైన క్రమశిక్షణలో పెట్టిం

దామె. బాబుకూడ అల్లరి చిల్లరగా తిరగకుండా, తల్లి మనస్సుకు అనుకూలంగా ప్రవర్తిస్తూవుండటం మూలాన, ఆమె ప్రయత్నాలన్నీ సవ్యంగా, సఫలీకృతం కావటానికి ఎక్కువ దోహదకారి అయ్యాడు.

"వయస్సుకుతగ్గ చదువు కాదు నాయనా ... ఏదో చదువుతున్నాడు" అంటుంది జానికమ్మగారు, మీ అబ్బాయి ఎల్లా చదువుతున్నాడండీ అని అడుగుతే. అవునుమరి! పట్టుమని పదేళ్లైనా లేవు అప్పుడే సెకండ్ ఫారం. బాబుకు మూడు నెలల పరీక్షల లోను, ఆరు నెలల పరీక్షలలోను ఫస్టుమార్కులు రావటంతోటే, జానికమ్మగారి కలలకు ఓ స్వరూపం ఏర్పడింది. తన బాబుకు ఎంతో భవిష్యత్తువుందని భావించడానికి ఓ దారి ఏర్పడింది. ... క్రమేపీ జానికమ్మగారి హృదయంలో, బలమైన పునాదులతో మేడలగోడలు లేవటం ప్రారంభించాయి.

అంతమంది తోటివిద్యార్థుల సమూహంలో, పెద్దల కరతాళధ్వనులమధ్య, ఉపాధ్యాయుల ఆశీర్వచనాలతో, ఆరు నెలల పరీక్షల అనంతరం, బాబు బహుమానాలను అందుకున్న దృశ్యం, జానికమ్మగారి హృదయంలో హత్తుకుపోయి, స్థిరపడిపోయింది.

ఒక్క చదువు విషయంలోనేకాదు, ప్రతీ విషయంలోను బాబు మొట్టమొదటివాడుగా వుండాలని ఆమె అభిలాష. అందుకనే, ఇప్పటినుంచి బాబును ఓవిధమైన క్రమశిక్షణలో పెట్టడానికి ప్రయత్నించ సాగింది. ... కాలకృత్యాలు తీర్చుకోనటం దగ్గర నుంచి, స్కూలువేళదాకా, పుస్తకందగ్గర కూర్చుని చదువుకునేటట్టు చేయటంవరకు, అసంకల్పిత ప్రతీకార చర్యలవలె బాబు చేయగలిగేటట్టుగా చేసిందామె. బాబుకూడ ఆ టైంటేబులుకు అలవాటు పడిపోయి, కాలంయొక్క విలువను యిట్టే గ్రహించ గలిగాడు.

సినీమాలకని నాటకాలకని వెళ్ళకుండా, వాటి చెడుగుణాలను కట్టుకథలుగా వర్ణించి, బాబు మనస్సుకు యిట్టే హత్తుకుపోయేటట్టుగాచేసి, సినీమాలన్నా, నాటకాలన్నా ఓ విధమైన విరక్తిభావం కలిగించింది.... చెడుస్నేహాలకుపోయి, పాడైపోకుండా ఎన్నో కట్టుదిట్టాలు చేసింది.

ఇటువంటి సుగుణాలతో బాబు మెలగటం మూలాన, జానికమ్మగారిచేత ఒక్కసారికూడ బాబు దెబ్బతిన్న పాపానపోలేదు. .. అసలుమాటపడటమంటేనే అభిమానం. జానికమ్మగారుకూడ చూసి, చూసి ఒక్క దెబ్బకూడ కొట్టలేకపోయేది. జానికమ్మగారి ఉద్దేశ్యాలకు, ఆశయాలకు, బాబు అడ్డంకిలేకుండా, అనుకూలంగా నడుస్తూవుండటంమూలాన, ఆమె హృదయంలో ఓ ప్రత్యేక స్థానాన్ని పొందగలిగాడు.

◆ ◆ ◆

పొద్దు పడమరకువాలింది. సాయంత్రం ఐదో, ఐదున్నరో అవుతుంది. ఎక్కడో రెండుమైళ్ళ దూరంలోవున్న స్కూలునుంచి, పిల్లలు పుస్తకాలతో, టిఫిన్ క్యారియర్లతో, మాసినబట్టలతో, చెదరినజుట్టుతో, నకనకలాడే ఆకలితో, ఒక్కొక్కళ్ళే వస్తున్నారు. ప్రొద్దుట వెళ్ళేటప్పుడు వున్న వుత్సాహం, సాయంత్రం వచ్చేటప్పుడువుండదు. ... ఎక్కడి స్కూలు? ఎక్కడివూరు?

వచ్చేపోయేజనాన్ని చూస్తూ, జానికమ్మగారు వీధి గుమ్మంలో సావకాశంగా కూర్చున్నారు.

పక్కింటివారబ్బాయ్, శంకరంకూడ వస్తున్నాడు ... అయితే బాబుకూడ వస్తున్నాడన్నమాటే. ప్రతీరోజు బాబు, శంకర్లు, స్కూలునుంచి జట్టాపట్టీలు వేసుకుని, వస్తూవుంటారు. కాని ఈ రోజున శంకరం ఒక్కడే వచ్చాడు.

శంకరం రాకను చూసింది జానికమ్మగారు. తన బాబుకూడ వస్తూవుంటాడని, చిరునవ్వుతో స్వాగతం ఇవ్వటానికి లేచింది....ఎప్పుడో ప్రొద్దున్ననగా తిన్న అన్నం, ఎక్కడో రెండుమైళ్ళ దూరంలోవున్న స్కూలుకు వెళ్ళిరావాలి. మధ్యాహ్నం పట్టుకెళ్ళిన

టిఫిన్ కాస్తతిని, మంచినీళ్లుత్రాగి మూతి తుడుచుకుంటాడు. మళ్ళీ సాయంత్రం స్కూలు వదిలిపెట్టే సరికి, ఒక చేత్తో టిఫిన్‌కారియర్‌తో, మరోచేత్తో పుస్తకాల సంచితో, ఎంతో ఆకలితో వస్తాడు. అందులోను వయస్సుకుతగ్గ చదువుకూడ కాదు. పైగా నడక ... జానికమ్మగారు చిరునవ్వుతో ఆహ్వానించే సరికి, బాబు తను అంతదూరం నడచిన శ్రమనంతా ఒక్కసారి మరచిపోతాడు.

... ... జానికమ్మగారి చిరునవ్వు స్వాగతం వ్యర్థమైంది. బాబు యింకా రావటంలేదు. వెనక్కాలే, ఎవరితోనైనా మాట్లాడుతూ వస్తూవుంటాడని, త్వరలోనే రావచ్చునని, తన మనస్సును సమాధానపరచుకుంది.

ఓ సారి, వీధిలోకివెళ్ళి, కనుచూపు మేరవరకు చూసి నిరాశతో యింట్లోకి వచ్చేసింది.

జానికమ్మగారు కాళీగా కూర్చోనటం యిష్టంలేక, లైట్లలో కిరసనాయిలుపోసి, వెలిగించి, పక్కవేసి, బాబు చదువుకు కావలసిన సరంజామా అంతా సిద్ధంచేసి, బాబు రాకకై ఎదురుచూస్తూ కూర్చుంది.

బాబు, ప్రతీరోజు ఈ పాటికే భోజనంచేసి, పుస్తకం పుచ్చుకుని, చదువుకుంటూవుండవలసింది. ... కాని ఈ రోజున ఎందుకో ఆలస్యం అయింది.

నిన్నను ఈలాగే ఆలస్యంగావచ్చాడు. బాబు లేని ఆ అరగంట ఆరుయుగాలుగా గడిపింది జానికమ్మగారు. ఎందుకు ఆలస్యంగావచ్చావురా అని అడిగితే ఏవేవో సాకులు చెప్పేడు. ... దాంతో కోపంవచ్చి నాలుగు కేకలు పెట్టిందికూడ. బాబుని, ఇంతవరకు జానికమ్మగారు అతని హృదయానికి బాధ కలిగించే పల్లెత్తుమాటకూడ అనలేదు. ... అందుకనే ఆవిడ కేకలేసిన తరువాత, అభిమానంతో మొహం కిందకుదించేసుకుని, అరగంటదాకా తిరిగి తల్లిమొహంకేసి చూడలేకపోయాడు. ... అలాగని కోపంవచ్చి ఈవేళకూడ ఆలస్యంగావస్తాడా ? అబ్బే ! తన బాబేం అంత తెలివితక్కువవాడేంకాదు....త్వరలో రావచ్చుననే ఆశతో తన మనస్సును సంబాళించుకుంది.

ఒకవేళ స్కూల్లో ఏదైన మీటింగు వుందేమో ! ... అంతేఅయివుంటుంది. మీటింగు వున్నట్లయితే వీళ్ళందరు ఆగకుండా ఎందుకువచ్చేస్తారుచెప్మా ?... పక్కింటి శంకరాన్ని అడుగుతే అన్ని విషయాలు తెలుస్తాయి.

చదువుకుంటున్న శంకరం దగ్గరకువెళ్ళి అడిగింది జానికమ్మగారు. “ఏంనాయనా ! ఈ వేళ స్కూల్లో ఏదైన మీటుంగుగట్రావుందా ?”

“ఏంలేదండి ... వుంటే మేం అందరం ఆగం మరి! మీటింగు వున్నట్లు మాకేం నోటీసురాలేదు” అన్నాడు.

“అయితే మా అబ్బాయి స్కూలుకు వచ్చేడా లేదా అసలు.” ఎందుకో జానికమ్మగార్కి తన బాబుమీద ఒక్కసారి అనుమానం ముంచుకువచ్చింది.

“రాకేమండి. వచ్చాడు. మధ్యాహ్నము మేము అందరముకలిసి టిఫిన్ తిన్నాముకూడాను. ... సాయంత్రము, స్కూలు వదిలిపెట్టిన తరువాతకూడ కనబడ్డాడు నాకు.”

“స్కూల్లో మీటింగ్ ఏమీలేదన్నమాట” రెట్టించి అడిగింది జానికమ్మగారు వచ్చేస్తూ.

“అబ్బే ! లేదండి ... ఏమండి అలా అడుగుతున్నారు ?” దేన్నో వెతకటానికి ప్రయత్నిస్తున్నట్టుగావున్న ఆమె తీక్షణమైన మొహంలోకి చూస్తూ ప్రశ్నించాడు.

“ఏంలేదునాయనా ! ... మా వాడు స్కూలు నుంచి యింకారాలేదు. ఏమీటింగైనావుంటే ఆగిపోయాడేమో ... నిన్ను కాస్త తెలుసుకుందామని వచ్చా.”

“మీవాడు ఎందుకురాలేదో తెలియదుకాని, స్కూల్లో మీటింగుఏమిలేదండి. ... పోనీ ప్రయివేటుక్లాసు ఏదైనా వుందేమో అంటే అదీలేదు. ఒకవేళ ఏమున్నా ఈ పాటికి వచ్చేయద్దండిమరి.

(1164 పేజీ చూడుడు)

# స్త్రీలు - చిత్రకళ

కవిశేఖర శ్రీ విశ్వనాథ నరసింహము

వివిధకళోపాసకుల కవలంబనముగాను సృష్టికిని తదీయస్థితిలయములకునుగూడ నాధారభూతముగా నెంచబడు నాదిశక్తి యపరావతారములుగా నార్యయుగము నుండియు నెంచ వేద వేదాంగములలో బ్రస్తుతికెక్కిన లలనాజనంబులు లలితకళలకును అందు శిల్ప చిత్రలేఖనములకు నెంతగా నాధారములయిరో, వారా కళల యందెంతగా నారితేరియుండిరో, సారస్వత నిదర్శనముల మూలమున నుదహరించుట ప్రస్తుత కార్యమున కవశ్యమని యీ దిగువ విషయముల పొందుపఱచుచున్నాము.

హరివంశమునందలి యుషాపరిణయము సుప్రసిద్ధమగు పురాణగాధయగును. అందు బాణాసురుని కొమరితయగు ఉషాకన్య దేవీ ప్రసాదమునంది యామెనర్చించునపుడామె, వైశాఖశుద్ధ ద్వాదశినాటిరేయి హర్మ్యతలంబున నిద్రాముద్రితయైన ఆమెను నిజతల్పంబున ననఘశరీరుండగు పురుషాగ్రణి యొక్కరుడు ఆమెను గదిపి తియ్యని పలుకుల నానందింపజేసి, బిగియార కౌగిటం బెనంగి చతుర సంభోగముల వితముల నర్తించి ఆత్మమూర్తి ఆరమణీ మణి తలంపున నెలకొనునట్లుగా జేయువాడామె వరుండగునని యానతిచ్చెను. అటులనే ఆమె నిర్దిష్టదివసంబున అర్థనిశీథమునందు హర్మ్యతలంబున నిద్రించియున్న యువసరంబున నొక మనోహరాకారునితోడి సంభోగ సౌఖ్యము ననుభవించెను.

ఎఱుకగల్గినంతనే ఆమె విలపింప దొడంగిన నామె చెలికత్తెయగు చిత్రరేఖ ఆమె నూరడించి దేవీ ప్రసాద వాక్యంబుల స్మృతికి దెచ్చెను. ఉషారమణిని స్వప్నమున సంగమసౌఖ్యమున నలరించిన యాతడెవ్వడో తెలియుటకెట్టి అవకాశమునులేదు. మనసులో నెనసిన యాసుందరమూర్తి ఆకారచేష్టిత సరసత్వంబుల ననుభవించి మిక్కిలి చొక్కు నొందిన ఉషాయోష అతడెవ్వడో చెప్పంజాలదయ్యెను.

అంతఁ జిత్రరేఖ, యోగవిద్యావిదితయైన మహానుభావురాలు, తానొక మార్గమును చూపినది. చిత్తరు నిర్మాణంబునకు వలయు వర్ణంబుల సేకరించినది. తూలిక నొప్పుగా ధరించి పదునాలుగు భువనంబుల, విదితరూప యౌవనోద్భాసితులగు వయసుకాండ్ర, ప్రఖ్యాత పురుషులగువారిని, వారి వారి యాకారములతోడను, అంబరాభరణాదులతోడను, హావభావ లాలిత్యంబులతోడను, వివరంబులన్నిటితో సప్తరాత్రంబులలో వ్రాసి

తెచ్చి నెచ్చెలి యుషాసుందరి ముందట విచ్చి చూపి, అచ్చెరువొందు నమ్ముగ్ధకు వారివారినెల వేరువేరుగా నిరూపించి చెప్పెను. అపుడు ఆ యుషాసుందరి 'నీ కౌశలమేమని చెలియా కొనియాడుదు'నని హృదయానందంబును వెలిపుచ్చినది. అట్టి ఆనందమా మెయేకాక ఆ కధాశ్రవణమున మనముకూడ చిత్రరేఖ చిత్రకళాకౌశలము నెంతయు కొనియాడకుందుమా! అయిన నట్టి చిత్రకళా కౌశలాదులు చిత్రరేఖకు యోగ విద్యామహాత్వమువలన గల్గినవని చెప్పంబడియున్నది. లలితకళలకు పూర్వ జన్మ సంస్కారాదులును ప్రస్తుత జీవితమునగూడ దేవతోపాసనాదికములును అవశ్యములని తలంచువారు నేడుగూడ నున్నారు.

ప్రభావతి సూరనసృష్టి. అందు మొదటనే ఒక చిత్రఫలక వృత్తాంతము బయల్వెడలినది. అయ్యది అగజచేతనే ప్రభావతికీయంబడినది. ఆ చిత్రరూపముం దిలకించునపుడు.

'కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కముచూచి నట్లుతో
బలుక గడంగినట్లు గడుభావ గభీరత లబ్బినట్లు పెం
పొలయఁ దనర్చి జీవకళయుట్టిపడన్ శివ వ్రాసి నట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను తాను బోటియున్.'

ఇందు కవీంద్రుడు చిత్రరూప మెట్లుండ వలయునో వ్యంగముగా చెప్పినాడు. కలకలమని నవ్వినట్లా చిత్తరువులోని రూపమున్నదనుట - ముఖవికాసము నందలి సౌందర్యమందు మూలమున ద్యోతకమగును. తెలకన్నుల నిక్కముచూచి నట్లున్నదనుటలో నేత్రములా చిత్తరువునందు తేజోవంతములై యుండెననియు, నేత్రముల మరించుటలోననే చిత్రకళా కౌశలమంతయు నిమిడియుండుననియు వ్యంగ్యము. తోడుతోడనే చిత్తరువునందలి పురుషుడు పలుకుటకు సంసిద్ధుడయినట్లుగా జెప్పబడినది. అనగా ఇంచుక పెదవుల కదలించినరీతి ఊహింపనగును. తరువాత భావగాంభీర్యము నాపాదించి కడపట ఒక ముఖ్య విషయమును కవి వాకొనినాడు. జీవకళ యుట్టిపడ వ్రాసిన చెలువమని పేర్కొనెను. జీవకళ తొణికిసలాడునట్లు చిత్తరువులుండవలెనని, ఇందువలన తెలియు విషయము. ఇది చిత్రకళా సౌందర్యమునకే కాక లలితకళలగు శిల్పాదులకుగూడ ముఖ్యముగా నుండవలసిన లక్షణము. జీవకళతో నొప్పారు శిల్పచిత్ర రూపములే ఎందును ప్రశస్తి కెక్కినవిగా నెంచబడుచున్నవి. ఈ వర్ణనమునందు సూరన మన కనుల యెదుట నా చిత్ర రూప మున్నట్లుగా సజీవమగు కవితా శిల్పమున జూపియున్నాడు.

(సశేషము)

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

ఉపనిషదులయందుగల విషయములంతయు అర్హత పొందిన సాధకులకొరకు తెలిపిన దివ్యజ్ఞానము. దీనిని మననముచేసి నిధిద్యాసశము పొందగలరని లిఖింపబడియున్నది. కనుక మానవుడు ఇందు తెలిపిన ముఖ్యాంశములను గాఢముగా ధ్యానసమయములలో విమర్శించుచువచ్చిన అందు ఇమిడియుండు గూఢభావములను కనుగొనగలడు. వేదాంత గ్రంథములను బాహ్యముగా పఠించువారికి, సత్యస్వరూపుని విషయముల్ను, మనోవ్యాపారమునకు, బుద్ధి వ్యాపారమునకు అతీతమని, ఆధార పూర్వముగా స్థిరపరచి వక్కాణించు బోధనా ప్రయత్నమున ఎట్టి రుచియు కలుగనేరదు. కనుక పక్వస్థితి పొందని సాధకులు వేదములను సమీపించి, అతి త్వరగా వెనుకకు పరుగెత్తినవారు అనేకులు గలరు. ఎందుకన ఇందుకనిన మహాపురుషుల వాక్యములు, బోధపడక, వాటి సారము తెలుసుకొనలేక, వాటి సత్యాభిప్రాయమును అనుసరించలేనందున, ఈ గ్రంథములను పారవేసి పరుగెత్తినవారైరి.

వేదములు హిందువుల శాశ్వత జ్ఞాన గ్రంథములు. ఇవి క్రోడీకరింపబడి నాలుగు ప్రత్యేక సంపుటములుగా వ్రాయబడియున్నవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము. ఈ ప్రతియొక్క వేదమున్ను వాటిలో మూడు ప్రత్యేక భాగములు కలిగియున్నవి. మంత్ర భాగము, బ్రాహ్మణ భాగము, ఉపనిషద్భాగము. ఈ విభాగములు వాటి వాటి సిద్ధాంతములనుబట్టి ప్రత్యేకింపబడి యున్నను, ఈ నాలుగు వేదముల చివరి భాగములలో ఉపనిషదులను అనుబంధింపబడి యున్నవి. మహానుభావులు ఆ ఆద్యంతరహితుని, ఆద్యంతసహిత వాక్యబద్ధముచేసి తెలిపిన జ్ఞానతేజో వాక్యములు అందు నెలకొని యున్నవి. జీవరాశి ప్రపంచములో, మానవాతీతులు నిర్మించిన ఉన్నత వేదాంత సిద్ధాంతములు వీటి స్వరూపములుగా యున్నవి. ఇట్టి ఉన్నతమై తేజోవంతమైన సత్య వాక్యములు క్రోడీకరింపబడి వేదముల చిట్టచివరన అనుబంధింపబడి యుండటచేత వీటికి వేదాంతములని పేరువచ్చెను. ఈ పేరు వీటికి వాచ్యార్థమున, అలంకారరూపమునకూడ యోగ్యముగ నున్నది. ఎందుకన ఇవి జ్ఞానమును పరిపూర్ణము చేయగలిగి యున్నవి. మరియు అమృత స్వరూప వేదగ్రంథముల చివరన యున్నవి.

భాష అనునది ఒక నిర్ణీత క్రమస్వరూపములు పొందిన శబ్దరాశి. వీటియొక్క భావము లేక అర్థము, పలుకువారికిని, వినువారికిని పరస్పర సమ్మతముకలిగియున్నది. వీటివలన జీవించి అనుభవించిన అనుభవములను మాత్రము తెలుప సాధ్యముగానున్నది. అనగా నిత్యజీవితమునందు సర్వ మానవులు అనుభవించు పరిమితికిలోనైన అనుభవముల నన్నిటిని భాషమూలమున తెలుప సాధ్యముగానున్నది. మరి పరిశ్రమవల్ల, కొన్ని అనుభవములను మాత్రము తెలుపనగును. జ్ఞానోద్రేక ఆవేశమునకలుగు ఆలోచనలను కొంతవరకు బైలుపరుప సాధ్యముగానున్నది. ఇంతకు మించి, అనుభవములు ఎంతటి సామాన్యమైనదైనను ఎంత తరచుగా ననుభవించుచుండినను, అనుభవించువాడు ఇట్టి అంతర జీవిత వ్యవహారమును భాషమూలమున తెలుపజాలడు. మరి జీవితమున ఏకోణమునగాని, అగాధముగ విచారించిన యెడల, అవి భాషమూలమున బహిరంగపరచుట కష్టతరమగుచున్నది.

కనుక, ఆద్యంతరహితుని విషయము ఆద్యంతసహిత భాషలో వెలపుచ్చుట దుస్సాధ్యము.

ఇట్లుండికూడ, మహా ఋషులు, ఆద్యంతరహితుని విషయములు, స్పష్టముగ భాషతో గాకపోయినను, భావనాశక్తివలన యోగ్యత సంపాదించిన శిష్యులకు, ఎరుగించుటలో పూర్ణ ఫలవంతులు కాగలిగిరి. ఇటు దుస్సాధ్య కార్యమును అర్ధసూచక వాక్యములతో కాకపోయినను, అనుమాన సూచవాక్యముల సహాయమున, సుసాధ్యము గావించియున్నారు. కనుక మనము ఉపనిషదులను నిఘంటువు సహాయమున, వాక్యార్థముల వివరణమును అనుసరించుచు పోయిన యెడల, భ్రమకు, అభావమునకు, విపరీత భావమునకు లోనగుచున్నాము.

ఉపనిషదు అను వాక్యమునకు మనము ఒక గురు పాదముల సమీపమున కూర్చుని, శ్రుతుల దివ్యభాష యందుండు గూఢార్థములను, పవిత్రభావములను బోధింపబడవలెనని భావము. ఇందలి మంత్రముల విమర్శయందు, అందుగల శైలి, భాష, సిద్ధాంతమును, సూక్ష్మముగా గమనించవలసి యున్నది.

అనాదికాలమునుండి చక్కని జీవిత సంప్రదాయమును గురించి, అనేక తరములుగా తీవ్ర విమర్శ జరుగుచునేయున్నది. కాని, తరతమమువారును, ఆయా కాలపు స్థితులనుబట్టి, మనుష్యుల గుణభావములను బట్టి వారి వారికి అనుకూలముగనుండు సమాధానములలో తృప్తిబడుచుండిరి. మనము దివ్యజీవితమును అనుసరించవలెనా, లేక సంఘజీవిత మనుసరించవలెనా యను సమస్య నేడు క్రొత్తగా తటస్థించినదికాదు. ఈ వాక్యముల మనకు క్రొత్తగా నుండవచ్చును. మన జీవితకాలములో ఏదో యొక నూతన అస్త్ర ప్రయోగమని తలచవచ్చును. కాని ఇందలి మూల భావము శాశ్వతమైనది; ఎల్లప్పుడు ఏకరీతిగా నుండునదే. ఈ సమస్య ఎప్పుడు సమాధానము పొందుననగా, "మన జీవిత గమ్యస్థానముఏమి? మన జీవిత విధానము ఎట్లుండవలెను?" అను ప్రశ్నకు తగు సమాధానము మనము పొందిన వెంటనే సమాధానము పొందును.

ఈ జీవితమునంతయు, స్వార్థరాహిత్యము, త్యాగము, ఆత్మాన్వేషణతో గడుపవలెనా, లేక మనకు, మనకు సంబంధించినవారికిని, విషయవాంఛలను సమకూర్చి, శరీరసౌఖ్యములు పొందించుటలో నిరంతర పరిశ్రమతో యావజ్జీవితము గడుపవలసినదేనా! జీవితము కర్మ సన్యాసమార్గమున నడుపవలెనా, లేక, కర్మమార్గమున నడపవలెనా! గౌరవనీయ చెన్న రాష్ట్రపతి, శ్రీ ప్రకాశగారు ఈ దివ్యమందిరమున, యజ్ఞశాలను ప్రారంభోత్సవము సలిపిన సమయములో ఈ విషయములను స్పర్శించి, వీటిరెంటి సమన్వయ సహాయమును సమర్థించియుండిరి.

ఇదికూడ క్రొత్తభావముకాదు. హిందుదేశపు వేదాంత వాఙ్మయమున, పూర్వీక ఉన్నత ఆలోచనాపరులలో కర్మ, జ్ఞానముల సమన్వయవాదులుండిరి. వారికి సముచ్చాయవాదులనిపేరు. ఇట్టి సమన్వయ వాదులలోకూడ పోరాటు తెగలుండెను. ఒకరు ఇట్టి సమన్వయమునకూడ కర్మకు ప్రధానము చూపువారుగానుండిరి. ఇది కర్మప్రధానవాదము. మరి కొందరు జ్ఞానమును (జ్ఞానప్రధానవాదము). మరి కొందరు కర్మ, జ్ఞానముల సరిసమాన సమన్వయము కోరువారు. (సమప్రధానవాదము)

సామాన్యముగా, మానవజీవిత ప్రతిశతాబ్దము నందును, కర్మము, జ్ఞానము లేక, సాంఘిక, దైవిక, జీవిత సమస్యలు దోలాయమానముగానుండుట కనుగొనగలము. ఒక తరమున, ప్రశాంత ఆంతర జీవిత ప్రవృత్తివలన, మానసిక, వైజ్ఞానిక కళాభివృద్ధిగాంచుటయు, మరియొకతరమున, నిరంతర, రక్తప్రవాహములతో, చమటకారుటతో, దేహకష్టములకునోర్చి, కుటుంబ సాంఘిక, జాతీయ జీవిత సౌఖ్యములను కల్పించి, మానవుని, మానవ సంస్థలను, ఉన్నత "కనక" స్వర్గమును చేర్చతలంచుట సాగుచున్నది.

నేటి మన జీవిత సమయము ఇట్టి విషయవాసనా

ప్రవాహావురువడియొక్క చివరిభాగముగా యుంటున్నది. ప్రపంచము నేడు అలసిపోయి నిర్జీవముపొంది యున్నది. కండ్లలో అశ్రుధారలు నిండియున్నవి. ముఖమున నిరుత్సాహము ప్రకటితమైయున్నది. తన లోపములకు పరితపించుచున్నది. తాను జారబోవుకొనిన శాంతస్వరూప రాజ్యమును, వినయస్వరూప సౌభాగ్యమును మరల సంపాదించుకొన వూపిరి ఎగబోసుకొనుచున్నది. అట్టి రౌద్రాకార మోహాంధ పశ్చిమ దేశములు రక్తప్రవాహ గాయములతో ఘోర వేదనలపాలై శాంతము, సమాధానము దొరకగలదాయని తూర్పుదేశములవైపు జూచుచున్నవి!!

ప్రాచీన మహా ఋషులు, జీవిత సమష్టిని గమనించువారై, మానవ సంఘములయందు ఇట్టి ప్రవాహ వురవడులు పదే పదే గలుగుచుండు నైజమును గమనించియుండిరి. ఇట్టి పరిస్థితులను చక్కగ విమర్శించ గలిగిరి. వీటిని చక్కగ నిర్మించగల సూచనలను గమనించిరి. వీటి నివారణకు వారు చూపుగల అమృత తుల్య సమాధానము ఉపనిషదులు సిద్ధాంతముగా నున్నది. అందు నేడు ఈ పాల్ఘాట పట్టణయజ్ఞమున ఈశావాశ్యోపనిషదును మనము విమర్శింపకూడి యున్నాము.

ఈ ఉపనిషదునందలి మంత్రములను విమర్శించు ప్రయత్నమున ఇాదు దాగియుండు సౌందర్యభావములను, జ్ఞానసంపత్తిని కనుగొనగలము. అంతేయే గానీ, ఈ సమస్యలకంతయుగల సూక్ష్మసమాధానమును మహానుభావులు తెలిపినరీతిని కనుగొనగలము. వారి ప్రబోధయంతయు జ్ఞానమార్గమును అవలింభింపమనియున్నది. కాని వారు కర్మమార్గమును ఖండించుటలేదు. అంతయే కాక, సన్యాసజీవిత ఔన్నత్యము పొందుటకు అది ముఖ్యసాధనముగా నున్నదని తెలుపుచున్నారు. వారిభావము ప్రకారము కర్మమార్గమును, జ్ఞానపూర్వకముగా జీవించి, మిక్కిలి శ్రద్ధతో, మన శారీరక, మానసిక, వైజ్ఞానిక అభివృద్ధి సంపాదించిన వెనుక, అంతమున, జ్ఞానమార్గమును శ్రద్ధతో ఆశించి, పొందగలుగుచున్నాము. సఫలముగా వర్తించి, ఉన్నత సత్యము, పరిపూర్ణము అను శిఖరాగ్రములను పొందగలుగుచున్నాము.

ఇందువల్ల, ఋషులు, కర్మమార్గము, జ్ఞానమార్గమునకు విరుద్ధమని ఖండించుటలేదు. మరియు, రెంటిని రెండుచేతులతో తీసుకొని, సమ్మేళణము చేయవలెనని తెలుపుటలేదు. కాని రెంటిని, వరుసక్రమమున, ఒకటివెనుక యొకటి అనుసరించవలెనని తెలుపుచున్నారు. మొదలు కామ్యకర్మములు సలుపుట, పిదప నిష్కామకర్మములు. దీనివల్ల సాధకుని, మానసిక వైజ్ఞానిక సంపద అభివృద్ధిగాంచును. వీటివల్ల అతడు ఉన్నత వ్యవహారమునకు అర్హతపొంది, ధ్యానముచేయగలుగుచున్నాడు. మానసిక ధ్యానము చేయగల యోగ్యత పొందినయెడల, త్యాగభావము సహజరీతి స్వాభావికముగ అతనికి నెలకొనును. మరి నిర్భందముగానీ ఆవరించుకొనును. ఈ సిద్ధాంతము, క్రమక్రమముగా ఇందలి మంత్రముల వివరణము వల్ల తెలుసుకొనగలము.

ఈశావాశ్యోపనిషదు శుక్లయజుర్వేద సంహితయందు కడపటి అధ్యాయము. ఇది యొక నిర్దిష్ట, పరిచిత సంహితయందు క్లుప్తభాగముగ కనబడుచున్నది కనుక ఈ ఉపనిషదును. సంహితోపనిషదు అనియు ఒక పేరు కలదు ఉపనిషద్వాక్యములు ఛందోబద్ధమై యున్న వాటిని మంత్రములు అని చెప్పుదురు. ఇట్టి ఛందోబద్ధమైన ఉపనిషదులు మంత్రోపనిషదులు అని తెలిపుదురు. అందువల్ల ఈశావాశ్యము, మంత్రోపనిషదు అనుటయే కాక, వాటిలో కడు ముఖ్యమైనది, రమ్యమైనది, సరిసమానములేనిది.

ఒక నిర్ణీత గురువుయొక్క నామధేయముతో గ్రంధసృష్టి సంపర్కము నెలకొల్పుటకు తగు సాక్ష్యాంశములు అనేక ఉపనిషదులకు దొరుకుటలేదు. ఏ ఋషిగాని, ఉపనిషదు వాక్యములు తమ స్వంతమని చిరునామ సంతకము చేయ సాహసించిన వారుకారు. అందువల్ల, ఉపనిషదులు సాధారణముగా ఒక ఋషి పేరుతో వ్యవహరింప బడుటలేదు. వాడునప్పుడు నిర్ణీత ఉపనిషదు వాడబడుచున్నదని తెలియుటకై

ఒక సంజ్ఞతో వాటిని పెర్కొన బడుచుండును. సాధారణముగా ఈ సంజ్ఞ మంత్రములయిందలి మొదట పదమును తెలుపునదిగానుండును. ఇట్లు ఈ ఉపనిషదు, మంత్రముల మొదట పదమును పేర్కొని ఈశావాస్య ఉపనిషదు అని తెలుపబడుచున్నది.

పూర్వము ఋషి పరంపర జ్ఞానదాన కార్యక్రమమునందు ఎట్టి ఉపనిషదుగాని, గురుశిష్యులిరువురు ఏకీభావముతో శాంతి మంత్ర పఠనము జరుప ఆరంభించుటలేదు. గురుశిష్యులిరువురు పఠించు ప్రార్థనమంత్రము సర్వదా ఒక శాంతిమంత్రముగా నుండును. నవీన అపనమ్మక కాలములో, విషయ వాంఛలు, జీవితమున ప్రార్థన ఎట్టి సంబంధము కలదని హాస్యము చేయగలరు. దీని అగత్యము, దీనికి గలశక్తి, దీనికిగల తేజస్సును అనుమానింపగలరు. ప్రార్థన అనునది బిక్షాటన వృత్తియందలి ఒక కార్యక్రమముగానే యుండగలదని అదిమనలను నిరర్థక బిక్షుకులనుగాజేసి మానరహితులను చేయగలిగినదే. ప్రపంచమంతటయు మత విషయములను గమనించిన ఇట్టి దురవస్థ వ్యాపించి యుండుట తెలుసుకొన గలము.

ఈనాడు మతావలంబకులు అని పేరు పెట్టుకొని, వారి దేవతలను, దుర్వినియోగ ప్రార్థనలతో, నామకార్థ ఆరాధనలతో, తమ పక్ష సహాయవాదులగను, దలారి వ్యాపారులగను, వైద్యులగను, ఘాతుక కృత్యముల ప్రోత్సాహకులగను క్రూరభావములతో ఉపయోగపరచుచున్నారు. ఇది ప్రార్థనయందుగల లోపముకాజాలదు. ఒక కుఠారముతో స్వంతతల్లిని పొడిచి చంపవచ్చును. లేక తన కుటుంబమును క్రూరులనుండి రక్షించవచ్చును. ఒక ఘాతకుని కుఠారమును పురిశిక్ష గావించుటలేదు. ఘాతకకార్యము చేసెనని నిందించుట కూడలేదు. అటులనే ప్రార్థనాక్రమము, ఒక జ్ఞాన సంపన్నుని వశమున యొక్క ఆశీర్వాద సంపత్తుగాయున్నది. కాని, దానిని ఉపయోగించు మనము దాని దుష్టకార్యములకు ఉపయోగించుచు దాని మానభంగముగావించి, దానికిగల గౌరవమును అధోగతికి తెచ్చుచున్నాము. దుర్వినియోగములవల్ల, ప్రార్థనకుగల శక్తిని దారబోసుకొనుచున్నాము.

జ్ఞాన భావముతో గమనించగలిగిన యెడల, ప్రార్థన అను విధానమువల్ల మనము సర్వోన్నత పరిపక్వము పొందగలుగుచున్నాము. అందువల్ల మనలోనున్న మనసుకు, బుద్ధికి అధిక పక్వదశయందు ప్రతిష్టింపగలుగుచున్నాము. ఇట్టి మన ప్రతిష్టాపనయందు సహాయ పొందుటకై, నాజూకుగాను, విచక్షణతోను, బాహ్యవస్తువుల సహాయమును పొందవచ్చును. అవి ఒక శివలింగము ఎదుట కర్పూరహారతి ఇచ్చుటగానున్నను సరే, లేక ఒక చర్చియందు పీఠముమీదనున్న క్రాసు వద్ద మైనపువత్తి వెలిగించుటగానైన యుండవచ్చును.

ఇట్టి కార్యముల యందెల్లను, గృహమునగాని, పాన్పుమీదగాని, లేక సహస్ర మైళ్ల దూరమునయున్న హిమవత్ప్రాంత్యములగాని, కర్తజేయు కార్యము ఒకటియే. ప్రార్థనకాలమున, మనము మనలోనే అగాధమునకు మునిగినవారమై, లోనున్న అమూల్య రత్నములవంటి, శక్తి, సామర్థ్యము, తేజస్సును, సంపాదించుకొని బాహ్యమున ప్రకాశింపగలుగుచున్నాము.

ఋషులు తమ విజ్ఞాన భవనములలో జరుపగలిగిన ప్రార్థనవల్ల గురువు శిష్యులు తమ బాహ్య ముసుగులను తొలగించగలిగి, వారిలోనున్న మనోబలమును, జ్ఞానతేజసును బాహ్యమునకు తేకలిగి, జీవితసమశ్యలో ఎట్టి సంఘటనమునుయైనను సాధించగల సమర్థతను పొందగలుగుచుండిరి. వారు తమ ఆంతరమున, అనంత, శాశ్వత పరిపక్వ పదవిని జ్ఞప్తికి తెచ్చుకొన గలిగుచుండిరి. ఇందుకనిన శాంతి పాఠము చాల ప్రఖ్యాతి గాంచినది. తరచుగా అన్ని మతకార్యముల యందు హిందుదేశమంతట, పురోహితులు తాము చేయు కార్యమున గల మహిమను ఎరిగినవారైన యెడల, తప్పక పఠింప వలసిన మంత్రగీతముగానున్నది.

# గృహలక్ష్మి

శ్రీ కడెము వేంకటసుబ్బారావు

---

ఐదుపరాలివై భువనమందున రాగరసోదయక్రియన్
బ్రోదియొనర్చు చుందువు ప్రఫుల్ల మనోజ్ఞ కటాక్షమే వసం
తోదయ రేఖయైనది, నవోదయమందు శుభోదయంబు సు
స్వాదువు చేయుచుందు వతివా! గృహలక్ష్మివి నీవు కావఁటే!

వాలించెదవుగదా! బటువుగుబ్బెతవయి – అరసిగ్గువీడని వరునిచూపు,
ఆలించెదవుగదా! అడ్డాల పాపాయి – లక్క పిడతనోటి తొక్కుపలుకు,
లాలించెదవుగదా! బాలికాబాలుర – రమణీయమైన మారాముసాము,
పాలించెదవుగదా! పట్టణగ్రామాల – కరిగి భత్యముదెచ్చినట్టి పతిని,

గృహపతి మగండు కావచ్చు గృహిణివీవు
అరయ నీ చేతి మీఁదుగా నన్నిజరుగు
నీ పలుకు చూపు నడతలు స్నేహగరిమ
జాతిపై ముద్రపడుచుండు సర్వవేళ.

నీ మాట మంతిలో నిగ్గును బసికట్టి - కవివిశ్వ సౌహార్ద కథలు చెప్ప,
నీలాలి పాటలో నెఱివర్ణములెఱింగి – గాణ నాదబ్రహ్మకలనఁ దేలు,
నీ చేతియూఁటలో నిర్ణిద్ర తేజుఁడై – సాహసాంకుఁడు తొడజబ్బఁజఱచు,
నీ బాట మలపులో నీతి శాస్త్రజ్ఞుఁడై - రాజ్యతంత్రజ్ఞుఁడు రాణకెక్క

నీవు లేకున్న పురుషుండు నీరసుండు
పురుషవచనంబు నీతోనె పూర్ణమగును
నీ కృపాభిక్షవలననే నిఖిల జగతి
బ్రతుకుచున్నది గృహిణి! సౌభాగ్యలక్ష్మి!

జాతిన్ నీతిగ నిత్యధార్మికముగాఁ జైతన్యవంతమ్ముగా
స్వాతంత్ర్యమ్ముగ దిద్ది తీర్పఁదగు నీ పాత్రౌచితిన్ జూడుమా!
తాతల్ చెప్పిన వన్నియు కదలిచి ప్రస్థానింపుమా! సృష్టికిన్
మాతృస్థానము నీయదేగద! అమందానంద సంధాయిని!

# న్యాయం

*శ్రీ రాజేంద్ర*

నాలుగు తరగతులు చదువుకొన్నా, ఉద్యోగం చేయడం ఇష్టంలేక, ఇంట్లోనేవుండి పొలంపనులు చూసుకోసాగాను. మాకున్నదల్లా మూడెకరాలపల్లం, రెండెకరాలమిట్ట, రెండెకరాల మామిడితోపు మాత్రమే. మా నాన్నకు మేంనలుగురు సంతానం. అందులో మా అక్కయ్యకు పెళ్ళయింది.

ఉన్న పొలంలో బాగా కృషిచేసి మంచిపంట రాబట్టేవాళ్ళం. మాకు ఇనప్పెట్టెలేదు; ఉండినా అందులో డబ్బువుంచే అవకాశంలేదు. తిండికి లోటులేకుండా బ్రతుకుతున్నాం. ఒక పెంకుటిల్లు మాతాత కట్టించిందివుంది. తెల్లగా బట్టలువేసుకొంటాం. ఒకరితో పేచీ లేకుండా మా బ్రతుకు మేంచూసుకొంటూవుంటాం!

మావాళ్లో చాలామంది ధనవంతులున్నారు. ఆ ధనవంతుల్లో మంచివారూ వున్నారు; దౌర్జన్యంచేసేవారూ వున్నారు. ఈ ధనికుల్లో (భూస్వాముల్లో) రాఘవయ్యపేరు చెబితే గజగజలాడేవాళ్లు ఎంతో మంది బీదబిక్కి వున్నారు.

మా ఊళ్లో రాఘవయ్య మాటకు అడ్డువుండదు. ఆయన వికృత చేష్టలకూ అవరోధముండదు. తన మాటకు ఎదురు తిరిగినవారిని, తన పనులకు అడ్డు వచ్చిన వారినీ నానావిధాలా హింసిస్తూవుంటాడు. ఎవరయినా ఎక్కడయినా తన చేష్టల్ని విమర్శించాడని వింటే చాలు, ఆ కబురుచెవికిసోకితేనేచాలు వాడిని రప్పించి చావబాదేవరకు వదలడు. న్యాయాన్యాయ విచక్షణతో అవసరంలేదు. రాజు తలస్తే దెబ్బలకు కొరవా మరి!

బజారులో ఏదోపనిగా వెళ్లుతున్నాను. దారిలోనే రాఘవయ్య ఇల్లు. ఆ ఇంటిలోనుంచి పెద్ద అరుపులు వినిపించాయి. బయట కొందరు నిల్చుని ఆలకిస్తున్నారు. ఏమిటని పరామర్శించాను. మా వూళ్లోనే 'రంగడనే కూలీ ఒకడున్నాడు. చాలా మంచివాడని ప్రతీతి. కొంచెం స్వేచ్ఛా జీవి. సొంతపొలం అర ఏకరం వుంది. దాన్నిసాగు చేసుకొంటాడు. అవసరమైనప్పుడు. వీలయినప్పుడు. తన కిష్ట మెచ్చిన వారికి కూలికి పోతాడు.

రాఘవయ్యది భారీవ్యవసాయం. ఆయన పనులకే ఒక్కొక్కమారు కొన్ని వందలమంది కూలీలు అవసరమవుతారు. వారి పనులొచ్చినప్పుడు మాలపల్లెలోని కూలీలెవ్వరూ 'ఇతర్ల పనులకు పోకూడదు. అలా వెళ్ళితే వాడికి తగిన శాస్తి జరిగి తీరుతుంది. రాఘవయ్య ఆ యేడు చెఱకు తోట చాలా వేశాడు. చెఱకు ఆడటానికి చాలామంది కూలీలు కావాలి. ఇంజనుతో ఆడుతారు. కూలీలు చాలక రంగణ్ణి పిలిచారు. రంగడు ఆరోజు పొరుగూరుకు వెళ్ళవలసివుంది. తన స్వంత బావమరిది పెళ్ళి జరుగుతోంది! అంచాత ఈ రోజు రావడానికి వీలుండదని చెప్పాడట. అసలు రంగడు ఏమిచెబుతున్నాడనయినా వినిపించుకోకుండా 'వచ్చి తీరాలనీ, లేకపోతే తగిన శాస్తి జరుపుతాననీ' బెదిరించాడు. కొంతసేపు మెత్తగా చెప్పాడట రంగడు. రాఘవయ్య ఆ మాటల్ని వినిపించుకోకుండా అమ్మా అక్కా అని బూతులు ప్రారంభించాడు. ఆమాటల్ని సహించలేని రంగడు– "నేను పోవాలి. రావడానికి వీలులేదు" అని వెళ్ళిపోయాడుట.

పెళ్ళినుంచి వచ్చిన తర్వాత ఇంటికి రప్పించారు రంగణ్ణి. తలుపు తోసుకొని, లోగావెళ్ళాను. ఇంటి వరండాలో రంగణ్ణి చేతులు విరిచి, లావాటి తాడుతో ఒకస్తంభానికి కట్టివేసివున్నారు. రాఘవయ్య, రంగణ్ణి చావమోదుతున్నాడు. శరీరమంతా వాతలు ఏర్పడివుంది. "ఇంకయినా చెప్పు" అంటున్నాడు రాఘవయ్య. రంగడు జవాబు చెప్పడంలేదు

కళ్లు మూసుకొని నిశ్చలంగా వున్నాడు. ఆ నిశ్చలత్వాన్ని చూసి మరీ రెచ్చిపోయాడు రాఘవయ్య. మంచిలావాటి కర్ర పుచ్చుకొని నాలుగు బాదాడు అరుస్తూ. రంగడిలో ఏమాత్రం చలనంలేదు. రెండు మూలుగులు మూలిగాడు. కళ్ళవెంబడి నీళ్ళు జారింది. నోటికొచ్చినట్లల్లా తిడుతూ, కొడుతూవున్నాడు రాఘవయ్యా, అతని కొడుకు చంద్రయ్యా!

"ఏమిటిది" అన్నాను. చంద్రయ్యతో "వీడు ఈ వెధవ మొన్న పనికి పిలిస్తేరాలేదు వీడి ఇష్టంగా ఆడుతున్నాడు. మొన్న ఎలెక్షన్లలోకూడా చాలా ఓట్లు-చీల్చేడు. వీడూ ఒక లీడరయిపోయాడు_ ముండాకొడుకు" అంటూ మళ్ళీ రంగడి చెంపమీద కర్రతో పొడిచాడు.

"అది వాడి స్వేచ్ఛ. కూలికిరాకపోవడానికి వాడికి వీలుండకపోవచ్చు; లేదా అవసరంలేకపోవచ్చు. కూలికిపోవడం వాడి ఇష్టంమీదా, అవసరంమీదా ఆధారపడివుంటుంది. దాన్ని అడగడానికి నువ్వెవరు? నువ్వేం అప్పూసప్పూఇచ్చి పోషిస్తున్నావా వాడిని. కరువులో కాపాడావా. కష్టాల్లో ఆదుకొన్నావా? ఇక ఎలెక్షన్సు — అసలు ఈ ఎలెక్షను జరుగుతున్నదే ప్రజల నిర్ణయాన్ని, అభిప్రాయాన్నీ తెలుసుకోడానికి. అటువంటప్పుడు వారికి అడ్డు చెప్పడానికి మనమెవరం" అన్నాను కాస్త గట్టిగానే. "వీడెవడు మధ్యవెధవ. వీడిని తన్నరా, మొదట! వీణ్ణి గేటుకవతలతొయ్యరా ముందు — ఎవడ్రా నువ్వు" అంటూ మీదికొచ్చాడు పదిమందిలో రాఘవయ్య

"అన్యాయం వద్దు" అన్నాను.

"ఎవరిది అన్యాయం, నీదా, నాదా! నామనిషిని నేనేమయినా చేసుకుంటాను. మధ్యనునీవెవరు—" కోన్‌కిస్కా— అని గర్జించాడు రాఘవయ్య:

"నీమనిషేమిటి? ఒకవ్యక్తిమీద నీకెవరిచ్చారీ అధికారం. నువ్వేం ఒక గవర్నమెంటు ఆఫీసరువా!" అన్నాను. రంగడు కళ్లు తెరిచి చూచాడు. రాఘవయ్య నా చెంప ఛెళ్లుమనిపించి మెడపట్టి గెంటాడు వెలుపలికి. 'కళ్ళనీళ్ళతో, తలవంచుకొని వచ్చేశాను, ప్రపంచంలో న్యాయాన్యాయాల స్థానాలు ఇలా ఉన్నాయ్' అనుకొంటూ.

# నిరుపేదతనమెంత ★ ★ నీచము

శ్రీమతి తూము చూడామణమ్మగారు

ప్రపంచమున మానవులకు కలిమిలేములు కావడికుండలని పెద్దలందురు. పూర్వుల నాటినుండి మహదైశ్వర్యముల ననుభవించుచు గొప్ప వంశీకులని పేరు గాంచిన వారికి సహితము కాలానుసారము లేమిడిరాక తప్పుటలేదు. యిది ప్రపంచ స్వభావమై యుండనోపు! సాధారణముగా గృహస్తునకు పేదరికము వచ్చుటకు కారణములనేకములుగలవు. సప్తవ్యసనములలో ఏ కొన్ని ఆచరించుట చేతనో, యెక్కు-వాడంబరముల వల్లనో, తగినంత విద్యలేకనో, చిన్న తనమునుండి సోమరి తనముచే పెద్దలార్జించిన ధనముండుటచే హాయిగ కూర్చొని తింటూ కాలము గడుపుదమనే యోచనచే, ధనసంపాదన లేకనో, యేకారణముచేతనైనను లేమి తప్పక వచ్చుచుండుట కలదు; ధనార్జన లేనప్పుడు కూర్చొని తిన్నచో మేరువంత ధనమున్నను కరిగి పోవును. యిక అట్టి వారల గతి యెట్టిదన – మొదటినుండియు భోగలాలసులై కష్టములకలవాటు పడని వారగుటచే జీవనోపాధికి మార్గముగానక సాటివారలలో అవమానము భరించలేక అనేక అవస్తల పాలగుచున్నారు. సంపద నుండునంతకాలము వీరింటపండ్లతరబడితిని వుపకారములు పొందినవారికిగాని, దగ్గర బంధువులకుగాని ఈ నాడు దరిద్రదేవత ఆవహించినవారిని జూచిన ఏవగింపు. ఎంత దగ్గరి బంధువులకైనను ప్రేమ వికలమై పోవును. ఒక విధమైన ఏవగింపు పొడమును. చనుముగా మాట్లాడిన తమరింట వాసము చేయుదురన్న భయముచే మోమును చాటుబెట్టికూడా తిరుగుచుందురు. ఐశ్వర్యముండునంత కాలము మనుజులలో గౌరవ ప్రేమలును, తొలగినచో నిరసనభావమూనా? యిదీ ప్రపంచ ధర్మమేనా! ఎంత విరుద్ధము! సంపన్న గృహస్తునింట పుట్టి పెరిగి, అట్టి వారి కోడలై సంసారసుఖమునందోలలాడుచున్నతరి ఆకస్మిక ఘోరతర దరిద్రదవానలమున దగులుకొనవలసివచ్చినప్పుడు ఆ స్త్రీకుండు పరితాపము మేరయుండునా. భర్త కృతబాధలకు చిన్ననాటనుండియు విద్యాబుద్ధులు గరచినదై గుణవంతురాలగు భార్య భర్త ననుకరించును. సామాన్యవనిత తన భర్త యజాగ్రతవలననే తానిక్కట్టులపాలైతినని గుందక మానునా? యీ కారణములవలన అపుడపుడు భార్యాభర్తలకు కలహము సంభవించుచుండుట వింతయా! ఆహా లోక

ములో దరిద్రమెన్ని విపత్తులకు మూలమై యున్నది! దంపతులప్రేమను భంగమొన రించును! బంధు అభిమానము భేదమొన రించును! తగినటువంటి శరీరపోషణలేక ఆరోగ్యముచెడి వ్యాధిపీడితులగాజేయును. అపుడపుడు పసిబిడ్డలతో సహితము ఉప వాసములుజేసి మలమలమాడవలసివచ్చు చుండును. యింకెన్నెన్నో యిక్కటుల పాలు జేయునుగదా! మొదటినుండియు గౌరవముగా బ్రతికినవారలకు తమపొట్ట కూటికై చెయ్యిజాచి నోరుతెరచి అడుగుటకన్న ఆత్మహత్యయే మేలని పించును. అట్లని అశువుల తృణప్రాయ ముగ అందరు నెంచగలరా? బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చునని ఆశ మాత్రము పీడించుచుండును. ఎక్క డెక్కడ బుట్టిన నదులును రత్నాకరుడను నాశచే సముద్రుని జేరువిధమున, జీవనో పాధికొరకు తమంతట తాము భాగ్యవంతు డైన ఏబంధువునింటికో కడకు చేరెదరు. ఇక నక్కడ వారిడుములు వర్ణనాతీత ములు. వీరి కుటుంబ మర్యాదలు ఎరిగి యుండినను తమరింటికి చేరినంతనే హీన ముగా జూచుట మొదలగు చర్యలు జరుపు టకు గడంగుదురు. తమరు తినే పదార్థ ములువేరు; తమరిల్లుచేరినవారు తినే పదా ర్థములువేరు. అన్నిటిలోను రెండు రక ములు తయారగుచుండును. నేతిచక్కెర లతో వారికి, నూనె బెల్లములతో వీరికి. సినీమా మొదలగు వినోదములకు పోవలసి వచ్చిన మూడువంతులు వారిని రమ్మని పిలువనే పిలువరు. ఒకవేళ విధిలేక పిలి చినా, విసుగుకొనుచు కసరుకొనుచు తమరు గుఱ్ఱపుబండ్లు మోటారుకార్లుపై నెక్కి, వీరిని ఏయెద్దులబండ్లమీదనో తోడ్కొనిపోయి, ఏనేలటికెట్టో వారికితీసి తమరు ఫస్టుక్లాసులో హాయిగ కూర్చొనె దరు. తమరింటికి ఎవరైనవచ్చి వీరెవరని యడిగిన తమకు బావగారి కూతురైనా అక్కగారి కుమార్తె అయినాసరే ఆ వావి వరుస మాత్రము చెప్పక మా చుట్టాలే నండీ అని చెప్పుదురు. యీ విధమున చూడబడుట ఎంత శోచనీయము! యివి అన్నియు అనుభవించుచున్న ఆ తల్లి యొక్క హృదయమెంత పరితాపమొం దునో చెప్పుటకు శక్యమా. వాటికన్ని టికి మూలమైన నిరుపేదతనమెంత నీచము. కావుననే ఈ ఆచారము పూర్వమునుండి యున్నదని చెప్పుటకు, విరాటకంకుభట్లయొక్కయు, ద్రౌపది సుధే ష్ణులయొక్కయు చరిత్రములవల్ల విదిత మగుచున్నది. పాండవులు తమ అజ్ఞాత వాసకాలమును గడుపుకొనుటకు విరటుని వద్ద కొలువుండుట కేగినప్పుడు ద్రౌపది

సైరంధ్రిగా సుధేష్ణ కడకరిగి యామెతో,

నీచములయ్యెడు పనులకు,
నా బాలిమి యెఱిగి మన్ననకు బాత్రముగా,
నీ చిత్తంబునగైకొని,
యాచారము దప్పకుండ నరయుము నన్నున్.

అని తన యొక్క నియమమును జెప్పకొన్నను, తమరింట యుండుటచేత నేగదా, సుధేష్ణ, కీచకుడు ద్రౌపదియందు మోహపరవశుడై యుండు టెరింగియు, తన్ను బంపవలదనియు, యొరులను బంపుమనియు ద్రౌపది ఎంత వేడినను వినక తన తమ్ముని యభిలాష తీర్చుటకై వానింటికి కల్లుతేర బుత్తెంచినది. అంతనా సాధ్వి కీచకాధముని చేపడినపాట్లు లోకవిదితమేకదా. తరువాత తనయొక్క మాటకు కాదని చెప్పటచేగదా విరటుండహంభావముచే కంకుభట్టును చేతనున్న సారెతో వ్రేయగ తగిలి ముఖమునుండి రక్తము స్రవించినది. యిట్టి దీనాతిదీనులై యుండువారలపై జేసెడికృత్యములు - అధికుల మనబడువారలే యీ ప్రకారముగావించిన యిక సామాన్యమానవుల మాట చెప్పనదేమున్నది! పూర్వాచారపరాయణులైన కొందరు శ్రీమంతులు తమకుండు భాగ్యమంతయు తమ ఆభరణాంబరములకును, భోగములనుభవించుటకును, తమ మతగురువుల సేవలకును, దేవాలయములలో నుండు పెరుమాళ్ల భోగకైంకర్య మొనరించుటకును తప్ప తదితర ధర్మములకు వినియోగింపరు. అట్టివి జేసిననే విశేషసుకృతమని ఎంతురుగాని అనాధలగువారిని ఆదరించుటగాని దీనమానవులయెడ కరుణ వీరలకసున్న. ఉదారభావమును స్వార్థత్యాగమును కనపర్చిననేకదా ఉత్తమ స్త్రీ పురుషత్వము ప్రకాశించును. క్షామదేవత పీడించు నీకాలమున పెద్దమ్మ ప్రియపుత్రికా పుత్రులు అనగా, ఒకప్పుడు ఉన్నతస్థితిలో యుండి కాలవశమున దరిద్రపీడితులైనవారు యిట్టివారలనే బ్రతికిచెడినవారందురు - వీరలకు స్వతంత్ర జీవనము చేయుటకు ఏపరిశ్రమచేతగాక పోవుటయే దారిద్ర్యమనుభవించుటకు ముఖ్యకారణమై యున్నది. యిట్టి స్త్రీలగతి యెట్లున్నదన తమ బాల్యమున పన్నెండేండ్లవరకు తలిదండ్రులు నేర్పించినవిద్య అనగా, సంగీతమో ఏకావ్యప్రబంధములో యింటియొద్దనో, పాఠశాలల్లలోనో నేర్చుకొనుటయేగాని ఆధునిక విద్యావిధానము నాడు అంతగా లేనికారణమున ఏటీచర్లగానో వుండుటకైనను పాపము వీళ్లకు అవకాశములేదు. నవనాగరకతా నారీమణులవలె కొంచమింగ్లీషు నేర్చి ఫాషన్‌గా యుండిననే వీరలకు సభలలోను సమాజములలోను స్థానము దొరకుటయు వారు వీరలతో సంభాషించుటయుకలదు. లేనిచో

వ్యర్థమే. స్త్రీజాతిపట్ల స్త్రీజాతిప నిరాదరణ చూపిన నింద్యముకాదా. జాతీయభావము జూపవలదా. స్వజాతిపట్ల ద్వేషాసూయలుండుట మిక్కిలి శోచనీయము కాదా. తోడి సోదరీమణులయొక్క దుస్థితిని తొలగించి, తగిన సహాయమొనరించునప్పుడే విద్యావతులనబడుదురు. లేనిచో అవిద్యావతులేగదా. యింతకు నేచెప్పునదేమన, గౌరవ కుటుంబములకు జెందిన నిరుపేదల స్త్రీలు ఒకరి సహాయముననే ఆధారపడియుండుటకన్న ఏదో రూపకమైన స్వయంకృషివల్లనే జీవించినచో మిక్కిలి శ్రేయోదాయకము. గాంధీ మహాత్ముని ఆదేశానుసారము రాట్నపరిశ్రమ కొంతమట్టుకు జీవనాధారమైయున్నది. గావున రాట్నలక్ష్మిని చేబట్టి దేశసౌభాగ్యమునకు, జీవనోపాధికొరకు కృషిచేయగలరని ఆశిస్తున్నాను.

# పెండ్లిపిలుపు

శ్రీమతి వే. వినత

రామారావు – ఇంటియజమాని.

రాణి, వాణి – కూతుళ్లు.

సరస్వతమ్మ – రామారావుగారి భార్య.

సుందరం – కొడుకు, వయస్సు 30, 32.

అప్పయ్య దీక్షితులు – పిల్లనిచ్చు పెద్దమనిషి

అవధాన్లు – పెండ్లిండ్ల పేరయ్య.

వెంకమ్మ – అప్పయ్యదీక్షితులుభార్య.

ఒక చిన్నయిల్లు. ఇంటిముందు కొద్దిగా శాంపౌండు. ఇల్లు చిన్నదైనా చూడటానికి డాబుగా వుంటుంది. సరస్వతమ్మ, కుమారుడికి అన్నంపెడుతూ-

"నాయనా! యెన్నాళ్లిట్లా వుంటావు" అన్నది.

సుందరం "ఏం. యెట్లా వున్నాను."

సరస్వతమ్మ "అదికాదురా-యెన్నాళ్లిట్లా పెళ్ళి చేసుకోకుండా వుంటావు. నీవు యేదో ఒక సంబంధముచూచి, ఊ అంటే ఆ మూడుముళ్లూపడితే చూడాలనివున్నది. యేదో పెద్దవాళ్లమయిపోతున్నాము. నీ కడుపున రెండుకాయలుకాస్తే చూచి సంతోషించేవాళ్లము. మీ నాన్నగారుకూడా చాలా తొందరపడుతున్నారు నీ పెళ్ళిని గురించి."

యేమీమాట్లాడడు సుందరం.

"యేరా-యెన్ని చెప్పినా వూరుకుంటావు. నేను ఒక్కదాన్నీ ఇంట్లో వుండలేకుండావున్నా. త్వరగా కోడలువస్తే బాధ్యత అంతా వప్పచెప్పి, కాశీ, రామేశ్వరము యాత్రలకు వెళ్ళాలనుకుంటున్నా"

"ఇప్పుడు యెవరు వద్దన్నారు. తప్పకుండా వెళ్లు."

మజ్జిగపోస్తూ, "సరే, నీ యిష్టం ఇంకయేం చెప్పను" అంది సరస్వతమ్మ.

సుందరం ఎమ్. ఏ. ప్యాసయి కాలేజీలో లెక్చెరర్‌గా పనిచేస్తూన్నాడు. బుద్ధిమంతుడు, నల్లగా పొడుగ్గా వుంటాడు. ఇప్పటికి పది సంబంధాలకు తక్కువకాకుండా చూచాడు. కానీ ఒక్కపిల్లా తన మనోభావాలకు తగ్గట్టులేదు. యేదో ఒక లోపం కనపడుతునే వున్నది. పిల్ల బాగా చదువుకోవాలి; తనతోపాటు వుద్యోగంచేయాలి - సంగీతం రావాలి. పిల్ల యెఱ్ఱగా, సన్నగా పొడుగ్గా వుండాలి. దానిమ్మగింజలాంటి చక్కని పలువరస- ఇన్ని గుణాలు తను చూచిన యేఒక్క పిల్లలోను లేవు. ఇంకా చూస్తూనే వున్నాడు, తన కోరిక యెప్పటికైనా ఫలిస్తుందేమోనని.

ఒక రోజున రామారావు కోర్టునుంచివచ్చి బట్టలు విప్పి కోటుస్టాండుకు తగిలిస్తూ, "గుండెల్లో నొప్పిగా వుందబ్బా" అంటూ పక్కనున్న మంచంమీద వాలాడు. ఇదంతా చూస్తున్న సుందరం ప్రక్కవీధిలోనున్న డాక్టరు దగ్గరకు పరుగెత్తాడు. సరస్వతమ్మ భర్త గుండెలమీద కాపటంకాస్తూ కళ్ళనీళ్లు పెట్టుకుంది.

(ఇంతలో డాక్టరు, సుందరం ప్రవేశం)

డాక్టరు స్టెతస్కోపుపెట్టి పరీక్షచేస్తూ, "యెప్పటినుంచి మీకు యీ గుండెనొప్పి? ఇది వరకు యెప్పుడైనా వచ్చిందా" అని అడిగాడు.

రామారావు, "ఇది వరకు యెప్పుడూ లేదు. ఇదేదో క్రొత్తగా ప్రవేశించినజబ్బు - ఇంటికి వచ్చే దాకాకూడా యేమీ లేదు. మామూలుగా వున్నాను" అన్నాడు రామారావు.

డాక్టరు "ఔను, ఔను. ఇందాక వస్తుంటే చూచాను. మీరే కదూ." (ప్రక్కనవున్న కొడుకువంక చూస్తూ) "యేంఫరవాలేదు ఈయనకు బాగా విశ్రాంతి కావాలి. కొన్నాళ్ళపాటు యింటిదగ్గరవుంటే మంచి"దని ఒక ఇంజక్షన్ చేసి, తెల్లటిపొడి నీళ్ళలో కలిపి లోపలకు యిచ్చాడు. లేచివెళ్ళపోతూ ఒక టానిక్కు కూడా వ్రాసి యిచ్చాడు డాక్టరు.

(మరుసటిరోజు)

అవధానులు "పడుకున్నారేమండీ రామారావు గారూ!"

"ఈ మధ్యన వంట్లో మరీ బాగుండటము లేదు బాబూ! డాక్టరు బాగా విశ్రాంతి తీసుకోమన్నాడు. యివాళ్లో, రేపో అనేటట్లుగావుంది. నాపని. వాడికి ఆ మూడుముళ్ళూ పడతాయా ఈ ఘటం వుండగా. అని ..."

"ఆ, యెంతమాట అట్లా యెప్పటికీ జరగదు లెండి. అన్నట్లు మొన్న చూచిన సంబంధము యేమైంది? సుందరానికి నచ్చిందా పిల్ల."

"నచ్చితే నేను ఇట్లా యెందుకు మాట్లాడుతాను అవధాన్లూ! నేను యెన్ని విధాలో చెప్పిచూచా. లాభంలేకపోయింది. కక్కువచ్చినా కల్యాణం వచ్చినా ఆగదన్నట్లు ఆ ఘడియవస్తే అదే అవుతుంది."

"చూచారూ - గోవిందనగర్‌లో ఒక మంచి సంబంధమువున్నది. పిల్ల బి. యస్. సి. ప్యాసయినది. సంగీతము నేర్చుకున్నది, చూడటానికిపిల్ల బాగుంటుంది. మన సుందరానికి తగిన సంబంధము. తప్పకుండా చూడండి యిష్టపడతాడేమో!"

"చూడటానికేమి తప్పక చూస్తాడు ఆ మంచి రోజుకూడా మీరే చూచి చెప్పండి."

"రేపు నాల్గుగంటలకు మంచిది. నేనువస్తా- అంతాకలిసి వెళ్లవచ్చు."

సుబ్బారావుగారు ఒక పిల్ల జమీందారు. పూర్వము పెద్ద హోదాలోవున్నా యిప్పుడు అంతా పోయి సామాన్యంగావుంది. ఆయనకు ఒక్కతే కూతురు. ఆ కూతురికి పెళ్ళ యెత్తున పెండ్లిచేయాలనుకున్నాడు. పెండ్లివారు చూడటానికి వస్తున్నారు అంటే పెళ్ళి అంతా జరుగుతున్నట్లే భావించి, ఇద్దరు వంటవాళ్ళను పెట్టించి అయిదారు రకాల ఫలహారాలను చేయించి, 50 మందికిదాకా భోజన యేర్పాట్లు అవి చేయించి హడావిడిగా చేయించాడు.

(మరుసటిరోజు)

పెళ్ళికొడుకు తల్లి, తండ్రి కూతుళ్లు యిద్దరూ అవధాన్లు, పిల్లను చూడటానికి వెడతారు. గోవింద నగర్ వెళ్ళటానికి మధ్యన ఒక కాలువ దాటాలి. పెళ్ళివారు వస్తున్నారని తీసుకురావటానికి రెండు కార్లు. మధ్యన కాలువ దాటేందుకు ఒక యెద్దు బండి, నలుగురు నౌకర్లనుతీసుకుని, సుబ్బారావుగారు కాలువ దగ్గరకు వెళ్ళారు. అనుకున్నట్లుగా వారిని ఇంటికి తీసుకువచ్చారు.

నాల్గు గంటలకు అంతా కూర్చున్నారు.

పిల్లను గురించి అంతా చెప్పి, కూతురికి పెండ్లి కొడుకును పరిచయముచేసాడు.

ఆ పిల్ల నమస్కారముపెట్టి కూర్చున్నది.

సుందరం "యేమిగ్రూపు తీసుకున్నారు" అని అడిగాడు.

"బైయాలజీ తీసుకున్నాను."

"కాలేజీకి నడిచా బస్సుమీదా?"

"బస్సుమీదే"

సరస్వతమ్మ (అమ్మాయి తల్లితో) "అమ్మాయికి పనిపాటలువచ్చా" అని అడిగింది.

"బాగానే చేయగలదు. మనమంతా నేర్చుకునే వచ్చామా వచ్చేటప్పుడు! ఎవరి యింటికి వాళ్లు వెళ్ళితే వాళ్ళకే చేతవుతుంది."

ఆ రాత్రికి పిల్లను చూడవచ్చినవారంతా అక్కడే భోంచేసి స్వగ్రామం చేరుకున్నారు. వాణీ, రాణీ లకు పెండ్లికూతురు నచ్చలేదు. పొట్టిగా వుందని, ఒకళ్లు యెఱ్ఱిగావుందని పేరేగాని, కందిన యెరుపు యేంబాగుందని హేళనచేశారు. సుందరానికి లోపల కాస్త నచ్చినా, పైకి బాగుండలేదని చెప్పేశాడు.

సరే పిల్ల తలిదండ్రులకు పిల్ల నచ్చలేదని ఉత్తరం రాసేశారు.

ఒక రోజు, రామారావుగారు, సరస్వతమ్మ, కొడుకుతో "నాయనా! ఆఖరికి ఈ సంబంధము కూడా వద్దనేశావు. నీవేదో చూచి ఒప్పుకుంటావని గంపెడాశతో వున్నాము. అదికూడా వద్దనేశావు. ఆడపిల్ల లిద్దరికీ పెళ్ళిఅయిపోయింది. నీవుకూడా ఒక ఇంటివాడవు అవుతే చూడాలని ఆశగావుంది. నాకు గుండెపోటు యెక్కువగావున్నది. ఇక అట్టే రోజులు బ్రతకను. నీ పెళ్లిచూచి ఆనందించేప్రాప్తి నాకు లేనట్లున్నది. ఈ సారి పిల్లనుచూచి ఒప్పుకుంటే సెలవల్లో పెళ్ళిచేస్తాము" అని నీళ్లు నమిలాడు రామారావు

సుందరానికి రాత్రి నిద్రపట్టలేదు. తనవల్ల తల్లి, తండ్రి పడుతున్న వేదన ఇంతా, అంతా కాదు. నిజంగా తన పెళ్ళికి తండ్రి వుండడేమో అన్న కించకలిగింది. తను మొట్టమొదటే చూచింది వొప్పుకుంటే ఈ పాటికి ఒక పిల్లకాదు ... ... తనకి 20, యేళ్లప్పటినుండి చూచిన సంబంధాలు ఒక్కొక్కటే జ్ఞాపకానికి రాసాగాయి. తనకే నవ్వు వచ్చింది. ఈ సారి పిల్లనుచూచినా, చూడకపోయినా ఒప్పుకోవాలని గట్టి నిశ్చయానికి వచ్చాడు సుందరం. నిజంగా ఇంట్లో పిల్లలు కళ కళలాడుతూ తిరుగుతూవుంటే, అమ్మా, నాన్నచూచి యెంత సంతోషించేవాళ్లో. తెల్లవారంగానే అమ్మతో చెప్పెయ్యాలనుకున్నాడు సుందరం. ఈ సారి చూచిన పిల్లను తప్పకుండా చేసుకుంటానని.

కొద్ది రోజులు పోయాక అవధాన్లు యింకో సంబంధము చెప్పాడు. సుందరం ఈ సారి పిల్లను చూడనని, మీరే చూచి మంచి ముహూర్తము నిశ్చయిస్తే పెళ్లిచేసుకుంటానని చెప్పాడు. రామారావుగారు కొడుకులో కలిగిన మార్పుకు ఆశ్చర్యపోయారు.

(గుళ్లపూడి అనే గ్రామంలో అప్పయ్య దీక్షితులు అనే పూర్వాచార పరాయణుడువున్నాడు. ఆయన కూతురికి పెద్దమనిషికాకుండానే పెళ్ళిచెయ్యాలన్న పట్టుదలతోవున్నాడు.)

అవధాన్లు, అప్పయ్యగారితో "పిల్లాడు చాలా బుద్ధిమంతుడు, మంచి సాంప్రదాయంగల కుటుంబము. మనము వదిలిపెట్టాలిసిన సంబంధముకాదు" అన్నాడు.

అప్పయ్యదీక్షితులు "మరి కట్నం మాటో" అన్నాడు.

అవధాన్లు "కట్నంయేమీ అక్కరలేదు."

"పిల్లవాడి వయస్సెంత?"

"ఆ, అట్టే పెద్ద వయస్సు కాదులెండి; 30, లోపే."

"సరే, పిల్లవాడిని చూడవలసినపని లేదులేండి. యేదో ఒక శుభముహూర్తముచూడు; శుభకార్యము కానిద్దాము."

పెళ్ళి రేపనగా, పెళ్ళివారంతావచ్చారు. అయిదు రోజులు పెళ్ళి. చాలా బ్రహ్మాండంగా జరుగుతున్నాయి యేర్పాట్లు. వూరంతా మేళ తాళాలతో మారుమ్రోగుతోంది. తెల్లవారితే స్నాతకము. ఆడపెళ్ళివారిలో కలకలం బయలుదేరింది. అందులో ఒకావిడ.

"యేమమ్మా, వెంకమ్మా! నీ కూతురికి యింత కన్నా మంచి సంబంధము దొరకదనా. అంత ముసలివాడిని అల్లుడుగా చేసుకుంటున్నావు" అంది.

"అల్లుడు చిన్నవాడేనమ్మా మహావుంటే 20, యేళ్లు - యింతేగా" అన్నది వెంకమ్మ.

ఇంకో ఆవిడ "యేమిటమ్మాయి! అల్లుడ్ని అప్పుడే వెనకేసుకొస్తున్నావు. కాకిముక్కుకు దొండపండుకట్టినట్టు బలే సంబంధము దొరికింది!"

వెంకమ్మ మారుమాట్లాడలేకపోయింది. వెంకమ్మకీ బంధువులకు అనుమానంవచ్చి విడిదికి వెళ్ళిచూచారు. స్నాతకం పీటలమీద కూచున్న సుందరాన్నిచూచి నిశ్చేరపోయారు ఆడపెళ్ళివారంతా.

వెంకమ్మ చరచరా ఇంటికివచ్చి భర్తతో, "అంతా మోసం ఈ పెళ్లి నేను సుతరాము ఒప్పుకోను" అన్నది.

అప్పయ్యా దీక్షితులు అయిపోయిందిగా - కాస్త నా పరువు దక్కించి ఒప్పుకో" అన్నాడు.

వెంకమ్మ "ఈ పెళ్ళికనక జరిగేటట్లయితే, తక్షణం భావిలోపడి చస్తా"నన్నది. వచ్చిన చుట్టాలంతా అప్పయ్యా దీక్షితులిని దుయ్యబట్టుకున్నారు. 'అసలు ఇటువంటి సంబంధము అని తెలిస్తే ఇంతదూరం రానిచ్చేవాళ్ళంకాము. ఇది తప్పితే ఇంకోటి దొరకదనా యిది ఒప్పుకోటం. యెంత మాత్రము ఒప్పుకోటానికి వీలులేదన్నాడు' పిల్లమేనమామ. యెక్కడమేళాలక్కడ ఆగిపోయినాయి. ఈ సంగతి మొగపెళ్ళివారిదాకా వెళ్ళిపోయింది. ఇంత హడావిడి చేసి చివరికి పెళ్ళినాటికి, పిల్లకు యిష్టంలేదని చెప్పినందుకు చాలా ఆశ్చర్యపోయారు మొగపెళ్ళివారు. "ఇంతకూ అసలు సంబంధము చెప్పిన అవధాన్లు యేడీ" అన్నాడు ఒక పెద్దమనిషి - అవధాన్లు యిక కంటికి కనుపిస్తాడా! యెప్పుడో పారిపోయాడు.

మగపెళ్ళివారు తిరిగి ఇంటికిచేరారు. సుందరంలో కలిగిన మార్పుకు, ఈ సారన్నా పెళ్ళి అవుతుందనుకుంటే, అదీ తప్పిపోయింది పాపం.

# పేరమ్మ

శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

తను వెల్లం బులకింప ముత్యముల చందంబొప్పఁగా రాలు క్రొం
జినుకుల్ పైఁబడఁగా వనాంతరములం గ్రేళ్ళుబ్బు లేజింక రీ
తిని రమ్యప్రమదావనమ్మున నిశాధీశద్యుతుల్ గొల్వ హా
యిని క్రీడించుచు నుంటి వెవ్వతెవు? తల్లీ! నీవు పేరమ్మవా?

కిలకిల మంచు నవ్వి గిలిగింతలు వెట్ట నిశీథినీ కరుం
డలుక వహించి యిక్షువిశిఖాసనమున్ ధరియించి వాడి పూ
ములుకుల నేయ మన్మథుఁడు, మోహనుఁడౌ నలరాజు కోసమై
వలపు మరంద మంజలిని బట్టి నిరీక్షణ సేయుచుంటివా?

అమ్మా! యేమని చెప్పువాఁడను? మదీయ స్వాంతమే యీ యుదం
తమ్మాలించిన యంతమాత్రమునఁ జింతాపీడితంబయ్యె, దుః
ఖమ్మున్ బొంగుచు నుండె, నీ విషయ మాకర్ణించినన్ నీవు జీ
వమ్ముల్ తన్నిమిషంబ కోల్పడక నిల్వ నేర్తువే? లిప్తయున్.

జరిపిన సంధియత్నములు సర్వము వ్యర్థముగాఁగ భావి సం
గర పరిణామముల్ కనుల గట్టుచునుండఁగఁ దప్తచిత్తుఁడై
యరిగెడు నీమనోరమును నయ్యయొ! దుర్మతి నాగమాంబ మ
చ్చరము వహించి చంపెను విషప్రసవమ్ములు బంపి నిర్దయన్.

అశని సంపాత సంకాశమగుచుఁదోఁచె
నా? మనోహరు మరణ వృత్తాంత మకట!
మొదలు నఱకిన వృక్షముంబోలె ధరణి
వ్రాలిపోతివి స్మృతిదప్పి వనజనయన!

ఏవో చక్కనియూహ లల్లుకొనుచున్ హిందోళ ముంబాడుచున్
భావాకాశ పథంబునందు విహరింపంగల్గినా విన్నినా
ల్పీవేళన్ దెగటార్చిరయ్యయొ! కృపాహీనుల్ భవత్పక్షముల్
భావవ్యోమమునుండి కూలితివిగా పాతాళలోకమ్మునన్.

పసుపుం గుంకుమ దూరమైనవి సహింపన్ రాని వైధవ్యమున్
నొసటన్ వ్రాసెను బ్రహ్మదేవుఁడు కడున్ గ్రూర స్వభావంబునన్
రసహీనంబగు శేషజీవితము భారంబెంతయున్, లోకమో
హాసియింపంగడఁగున్. దరించుటెటులమ్మా! యీ విపద్వార్ధిన్.

కనుదోయిన శతకోటి సూర్యులను ధిక్కారంబుఁగావించు కెం
పునటింపన్ నడికట్టుఁగట్టి గగనంబున్ దాఁకనుంకించు నా
యనలజ్వాలల డాయనేఁగెదవదేలా? అగ్నిలోదూకి నా
థునితో సుందర నందనోప వనమందుంగూడ నూహించితే!

ఆగుముతల్లి! నీ విటుల నగ్నిశిఖాపరితప్తవై తను
త్యాగముఁజేసి తన్నహృదయ ప్రవిదారక వార్త విన్నచో
నేగతి నీదు తండ్రి సహియింపఁగలండు? దురంతవేదనా
సాగరమందు మున్గి కనఁజాలునె? క్రమ్మఱఁ జిత్తశాంతినిన్.

ఎంతటి సాహసమ్ము? లనమేనియుఁ గొంచక వహ్నిలోన ని
శ్చింతమెయిం జొరంబడి నశింపఁగఁ జూచుచునున్నదానవే!
కాంతుఁడు శాశ్వతంబుగను గన్నులు మూసిన వెన్కఁ గంటకా
క్రాంతము సారహీనమగుఁ గాంతల జీవితమంచు నెంచితే?

తాఁకినఁ గందిపోయెడు లతామృదులాంగివి వహ్నికీలికల్
సోకి శరీరమంతయును జుఱ్ఱునఁ గాలిచినం దొలంగఁగాఁ
బోకసహించి నిల్చితివిపో! సుమకోమల దేహమిట్టి య
స్తోక సహిష్ణుతా గరిమతో నలరారుట చోద్యమెంతయున్.

నాఁడు పురాణకాలమున నాథులుపోయిన శూన్యజీవితం
బీడువనొల్లనట్టి సతులెందఱో భర్తలతోడుతన్ జితిన్
మాడియొడల్ త్యజించిరఁట; మానినులం దలమానికంబవై
నేఁడు మృతిన్ వరించితివి నీవును లోకములెల్ల మెచ్చఁగన్.

నరసింగుండును నాగమాంబ పలుకున్ బాటించి నీ జీవితే
శ్వరు ప్రాణాలు హరింపఁ గొంకఁడొక యీ మన్మాత్రమే, నెట్టిమ
త్సర మా దుష్టుని చిత్తమందుఁగలదో శక్యంబె యూహింప ? సో
దరు పుత్రీమణికిన్ ఘటిల్లు విధవాత్వంబంచు వెన్దీయఁడే !

జరుగంబోవు రణమ్మునందెటు జయించన్ నేర్తు ? నాగమ్మయున్
నరసింగుండును, తచ్చమూతతులు భిన్నాభిన్నమైపోవె ? సం
గర రంగమ్మునయందు నీ యుసురుదాఁకన్, స్త్రీల శాపాలకుం
గురియై మున్పడినట్టివాఁడవని నొక్కొండేనిఁ గన్పట్టునే ?

రతనాల పెరిదేవీ ! – పతివ్రతల గాథలందుఁ బ్రథమగణేయం
బతిపూజ్యము నీచరితము – నతులొనరింతురు జగజ్జనంబులు నీకున్.






## చిలకడి దుంపల వంటకాలు

చిలకడదుంపలనే గనుసు గెడ్డలంటారు. తియ్యంగా రుచికరంగానుండి పిన్నలు, పెద్దలు పచ్చివి, కాల్చినవి తింటుంటారు. వీనితో వంటకాలు సయితం చేస్తుంటారు.

### కూరలు

బంగాళా దుంపలకు మల్లే చిలకడి దుంపలను ముక్కలుగా తరిగి పసుపు, ఉప్పువేసి ఉడకబెట్టి పైతోలు తీసివేసి వానిని నూనె కొంచెం అధికంగాపోసి పోపులో వేసి వేయిస్తున్నప్పుడు తగుమాత్రంగా కారము చల్లి కలుపవలెను. దోరగా వేగినతరువాత దించబోయేముందు మంచినిమ్మకాయరసం పిండి కలియబెట్టి దించవలెను. ఇది చాలరుచిగానుండి అన్నసాధకంగానేకాక రొట్టెలు, దోశలలోసైతం అనుబంధ ఆహారంగా వినియోగపడుతుంది.

చిలకడిదుంపలను సన్నగా చక్రాలుగాకాని, చిన్నముక్కలుగాకాని తరిగి నీళ్ళతో బాగాకడిగి ఆరబెట్టి యుంచుకొనవలెను. పొయిమీద బాణలిలో నూనె బాగా కాగనిచ్చి అందులో ఆరబెట్టియున్న ముక్కలను వేసి గోధుమవర్ణానికి రాగానే జల్లిగరిటతో జేవి ఎత్తి ఒక పళ్లెములోపోసి నూరిన ఉప్పు, కారము చల్లి బాగా కలిపి భోజనానికి వినియోగించుకోవచ్చును. వీనినే వేపుడు ముక్కలంటారు. కరకరలాడుతూ రుచికరంగా నుంటుంది.

### పులుసు (రకాలు)

గనుసుగెడ్డల ముక్కలు ఉడుకుతూ యుండగా చిక్కని చింతపండు పులుసు పోయాలి. అందులో పెద్ద ఉల్లిపాయముక్కలు, పచ్చిమిరపకాయలముక్కలు, కొద్దిగా పసుపు, కావలసినంత కారము, ఉప్పు వేసి తెర్ల బెట్టాలి. ఇంగువకూడ వేసికోవచ్చును. దింపి పోపు పెడితే రుచిగానుంటుంది.

గనుసుగడ్డ ముక్కలతో బాటు రామమునగపండ్లు (టమాటోలు) ముక్కలుకూడ వేస్తేపులుసుకు ఒక ప్రత్యేకమైన రుచి వస్తుంది.

సాంబారు, కూటులాంటి దక్షిణాది అన్న సాధకాలలో కూడ చిలకడి దుంపలను వాడతారు.

### పప్పు కూర

కందిపప్పు ఉడుకుతుండగా చిలకడదుంపల ముక్కలను, పచ్చిమిరపకాయముక్కలు, పసుపు, ఉప్పు, వేసి, అందులో వాకాయముక్కలుకాని, మామిడికాయముక్కలు కాని, విత్తనాలు తీసేసిన రాచ ఉసిరి కాయల ముక్కలు కాని వేసి బాగా మెత్తగా ఉడుకునప్పుడు ఇంగువపాలు, కరేపాకు వేసి దించి పోపుపెట్టి పప్పుకూరగా వాడుకోవచ్చును.

## పచ్చడి

గనుసుగెడ్డలను కుమ్ములో పెట్టి, పైతోలు తీసేసి, పోపులో వేయించిన మిరపకాయలు, ఉప్పు, పసుపు కలిపి రోటనుంచి చింతపండు పులుసు తగుమాత్రంగా కలిపి పచ్చడిగా నూరినచో తియ్యంగా, పుల్లంగా రుచికరంగా నుండును.

చేమగెడ్డ, కందగెడ్డలతో సయితం పచ్చళ్లు చేయడంకలదు.

తాడిగడప అనసూయాదేవి

## రసకాయ పులుసు

ఇది చిక్కంగా ముద్దపులుసు లాగుంటుంది. ఇందులో వంకాయ, బెండకాయ, కాకరకాయ దొండ, బీర, అనప, గుమ్మడి, పచ్చిమిరపకాయలముక్కలు పడి కలగాపులగంగా నుంటుంది.

శనగపప్పు, దాంట్లో సగము మినపప్పు, దానికి సమానంగా పెసరపప్పు దోరగా వేయించి బరకగా విసిరి యుంచుకోవాలి. చింతపండు నానేసి చిక్కని పులుసును సిద్ధపరచియుంచుకోవాలి. పరిమితంగా ఎండుమిరపకాయలు, జీలకర, ఆవాలు, ధనియాలు, మిరియాలు, మెంతులు, యింగువ పోపులో వేయించి మెత్తగా నూరి యుంచుకోవలెను.

చింతపండుపులుసును ముందుగా పొయ్యిమీద కాగుతుండగా తరిగి యుంచిన కాయగూరల ముక్కలు వేసి ఉడుకుచున్నపుడు ఎండుకొబ్బరి తురుము వేసి ఉండకట్టకుండా గరిటతో కలియబెడుతుండవలెను. తగుమాత్రంగా ఉప్పువేసి బాగా ఉడకనిచ్చి దింపేముందు పోపుగింజల పొడి వేయాలి. లభిస్తే కొత్తిమేరాకు, కరేపాకు దింపేముందువేసినచో సువాసనకలిగి యుండును. పులుసు పొయ్యిదిగిన తరువాత మామూలుగా పోపు పెట్టాలి. ఇష్టమున్నవారు చక్కెరగాని, బెల్లంకాని అందులో వేసుకుంటారు. దీనిని హైదరాబాద్ ప్రాంతాలలో రసకాయ పులుసు అంటారు.

యం. సీతాలక్ష్మి

---

# స్వాతంత్ర్య దినోత్సవము

కేసరి హైస్కూలులో ఆగస్టు 15-వ తేదిన స్వాతంత్ర్య దినోత్సవము జరిగిన సందర్భమున కేసరి ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రెసిడెంటు డాక్టర్ టి. యమ్. బాలకృష్ణ నెడుంగాడిగారు జాతీయ పతాకమును ఎగురవేశారు. ఉత్సవములో పాల్గొనిన విద్యార్థులు, ఉపాధ్యాయులు కొందరు బాలబాలికల తల్లిదండ్రులు ఎంతో ఉత్సాహంగా కనుపించారు. జాతీయపతాకము, దానిని గౌరవించి ఆరాధించవలసిన ఆవశ్యకతనుగురించి హెడ్మాస్టరుచే వివరించబడినది. విద్యార్థినులు ముచ్చటగా జాతీయగీతములను గానంచేశారు.

# రంతిదేవుని త్యాగము

శ్రీమతి యన్. యామినీపూర్ణ తిలకమ్మగారు

పూర్వము రాజ వంశోత్తముండయిన రంతిదేవుండు తనకీర్తి యిహపరంబుల వెలుంగ దన సంచితార్థంబులన్నియు దీనులకు బంచియిచ్చి, సకుటుంబుడై పేదయై అధమవృత్తి నవలంభించి నలుబది ఎనిమిది దివసంబులు భువిని జరియింపుచుండెను. అంత నొక దివసంబున దనకాకలి మిక్కుటంబైన సహింపజాలక కొలది కబళంబు భుజింప నుద్యుక్తుడుగాగ క్షుధార్తుండైన నొక భూసురుండరుదెంచినతోడనే తన కబళంబా భూసురున కొసంగి పంపివైచెను. మరల కొలది అన్నశేషమును నోటవైచుకొను దలంపున నుండగా శూద్రుండొకడరుదెంచి దన యాకలిబాధ నెరింగించిన తన నోట బడనున్న కబళంబొసంగి బంపివైచెను. మరల నింకొకముద్ద నారగింప నుండగా కుక్కలగమిగా డొక్కరుండరుదెంచి ముద్దనడిగెను. తోడనే కొలది శేషంబును నొసంగి పూర్తిగావించెను. ఇంతలో నొక్క ముదుసలి చండాలు డరుదెంచి, 'తండ్రీ! ఆకటనస్రుక్కుచున్నాడను – జ్వరబాధితుడను – అన్నము నమలజాలను, మధుర జలంబులేవైన తమవద్ద మిగిలిననొసంగినా ప్రాణంబులు రక్షింపు' డనెను. అంత రంతిదేవుండు తన మనంబున చింతనొంది,

అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావు మన్న రా
వన్న శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్ననమాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కడ చుమ్ము పుల్కసా ॥

అని నుడువుచు తనవద్దగల మధుర జలంబులు హరిసమర్పణమొనర్చి నా యీ జలదానంబున వీని హృత్తాపంబడంగి జ్వరంబుపశమించి సుఖంబుండుగాతయని వానినోట జలంబులు బోసెను. తోడనే బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షమై 'నాయనా! నీ ధైర్య త్యాగంబుల కచ్చెరువందితిమి, వరంబులడుగు'మనిరి. ఫలరాహిత్య బుద్ధిగల రంతిదేవుండు 'వరంబులు నాకేల! అంతయు దైవాధీనమై నడచినది. నేను దైవాధీనుండనగుచున్నాను. కోరికలతో దాన మొనర్చిన మానవునకు హరికటాక్షవీక్షణంబెట్లు లభించునని చెప్పి'తన పవిత్రాత్మను భగవంతులో లీన మొనర్చెను. అంతట బ్రహ్మాదులు చకితులై తమ

త్రోపలంజనిరి. త్యాగులను పరీక్షింప బ్రహ్మాదులకైనను నలవిగానిపని.

తదనంతరము రంతిదేవుని సహకుటుంబులు, సహచరులు అందరు దైవార్పిత మానసులైరి. వర్తమానకాలంబున రాజకీయంబులు, సాంఘికంబులు మొదలగు యిజంబులన్నియు త్యాగప్రపూరితంబులు కానిచో దీనమానవులెట్లు సుఖాత్ములు కాగలరు? మన నిత్యజీవితములరయుడు. ప్రకృతిభిక్ష నొసంగనిదే మన కాలము గడచుటలేదు. గాఢాంధకార మడంప సూర్యుండుదయింపనిదే నిద్రమేల్కొని సమస్త కర్మ కలాపములు సాగింప సమర్థులముకాము. ఇంద్రుండు వర్షము నొసంగినగాని భూమి సస్యశ్యామలమై ఫలింప నేరదు. మనము శిశువులమై యున్నప్పుడు జనని సకల విధములైన త్యాగములతో మనలను పెంచనిదే మనము పెద్దవారల మైనట్లు దోపదు. ఎన్నిరీతుల నాలోచించినను నేదో యొక దేవతవలననో దేవతా తుల్యులైన వ్యక్తులవలననో, దేశముగాని, సంఘముగాని, వ్యక్తులుగాని ముందుకు రాజాలరు. కృషీవలుండు చెట్టు, గట్టు, పుట్టగొట్టి గట్టిభూమినిదున్ని మెత్తపరచి ఎంతో త్యాగమొనర్చినగాని యింటివారెల్లరు అనగా బలహీనులైన ముదుసళ్లు, చిన్నపిల్లలు, స్త్రీలు కూర్చుని భుజయించుట, శయనించుట అను పలువిధములైన సుఖములను అనుభవింపజాలరు. ప్రతివ్యక్తి తాను సంపాదించిన ధనములో సర్వస్వము రంతిదేవునివలె త్యాగమొనర్పలేకున్నను తనకు తన పుత్రకళత్ర బాంధవ మిత్ర జనంబులకు సరిపోవగా మిగిలిన ధనమును గ్రాసవాసములకులేని మధ్య తరగతి ప్రజలెందరో వివేకులయ్యును కూడుగుడ్డలకు నవయుచున్న వారిజాడలరసి వారికి సహాయమొనర్చిన వారి పుణ్యం బగణ్యంబు గదా!

రాజకీయ ఉద్దేశముల మనములో నిడుకొని హరిజనోద్ధరణమునకెంత పెనగులాడినను వారి సాముదాయక జీవితములందు దురవస్థలు తప్పుటలేదు. భూతకోటి కంతటికీ ఒక్క సమయముననే తెల్లవారుచున్నది. ఒక్క సమయముననే వర్షించుచున్నది. సముద్రుడు డెల్లప్పుడు ఏకధారగా హద్దుమీరక సమవర్తియై ప్రవర్తింపుచున్నాడు. మనుజులేల యిట్టి వ్యత్యాసములతో తమతమ పక్షములతో దీనులయెడ పక్షపాతులై వారిని కనులెత్తియైనను జూడక స్వకార్య దురంధరులై మెలంగుచున్నారు! వారి ఆడంబర నాటకరంగములన్నియు దీనులగు ప్రజలను నిరుత్సాహులను జేయక మానవు. పైన బేర్కొనిన రంతిదేవుని చరితమువలన మానవ హృదయ కుహరములయందు సంచలనమునొంది అన్ని తరగతులవారిని వారి యిబ్బందులను, వారి తెలివి తేటలను, వారివలన దేశమునకు సంఘమునకు వ్యక్తులకుగల్గు నుపకృతియును గనుంగొని సహాయ మొనర్చిన సంఘము నిజముగ ముందంజ వేయగలదు.

శ్లో॥ అనిత్యాని శరీరాణి। విభవో నైవ శాశ్వతః।
నిత్యం సన్నిహితో మృత్యుః। కర్తవ్యో ధర్మ
సంగ్రహః॥

# తెల్ల రోజా!


రచయిత్రి : ఇన్ గే షోల్స్

అనువాదము : డాక్టరు వి. ఎన్. శర్మ


(గతసంచిక తరువాయి)

ప్రజలకు మాత్రం తెరల వెనుక జరుగుతూవున్న గుట్టంతా బాగా తెలుసు. ఈ ముగ్గుర్నే కాదు బంధించి వురితీసింది ! ... వందకుందిని బంధించారు. వాళ్లలో చాలామంది వురిశిక్ష పాలయ్యారు. వీళ్ళ నందరిని విచారణ చెయ్యడానికి బర్లను నగరానుంచి ముఖ్య న్యాయాధిపతి విమానంలో ఆ వూరికి వచ్చాడు. విచారణనంతా ఒక్క నిమిషంలో ముగించాడు. ఈ గుట్టు వూళ్ళో వాళ్ళందరికి తెలుసు. దాన్ని దాచిపెట్టడం ఎవరితరం ?

ఈపనినంతా పూర్తిచేశాక, పరస్థితులు మారిపోతాయా ? మర్నాడు ఈ క్రిందివారిని వురి తీశారని అధికారులు ప్రకటించారు.

విల్లీ గ్రాఫ్
ప్రొఫెసర్ కూర్ట్ హూబర్
అలెగ్జాండర్ షోమెరిల్.

ఏంచేశారని యిలా వీళ్ళని వురితీయడం ? ఎందుకు చేశారని ? ...

లోకులు కాకుల్లాటివాళ్ళుకదా ! కొంతమంది వీళ్ళని చీవాట్లుపెట్టసాగారు. వాళ్లు నాశనంకావటమే మంచిదని చంకలు వాయించుకోసాగారు ... మరికొందరు వీళ్లందరూ వీరులు! వీళ్ళ త్యాగం వల్లే స్వాతంత్ర్య దేవత తన కార్యాన్ని నిర్విఘ్నంగా నెరవేర్చుకోగలదు అని ధన్యవాదాల్ని సమర్పించసాగారు.

ఈలా ప్రాణాలను సమర్పించినవాళ్ళని వీరులని పిలవవచ్చునా ? వాళ్లుచేసిన వీరకార్యమేముంది? అని ప్రజాకోటి అయోమయంగా చూశారు. దాని నుండి వారిని బయటికి తీయడానికి, తద్వారా స్వాతంత్ర్య దేవతను దేశంలో నిలబెట్టడానికి చేయవలసిన కార్యకలాపాన్ని ఆలోచించారు. కార్యరూపంలో బెట్టి ధన్యులయ్యారు. వీరు సామాన్య కుటుంబాలకు చెందినవారే. ప్రజలు అనుదినం ఎదుర్కొంటున్న కష్టపరంపరలను చూసి వారేలా వూరక వుండగల్గుతారు ? వారి ఆదర్శాలు గొప్పవి. వీటిని కార్యరూపస్థాన బెట్టడానికి సాధనోపాయాలు లేవు. అయితేనేం ? సాహసంచేసి ముందంజవేశారు. నివురుకప్పిన నిప్పును బయటికి తీశారు. వుపన్యాసాలు ఈయలేదు. పెద్ద పెద్ద కబుర్లు చెప్పలేదు. అష్టకష్టాల్ని ధైర్యంతో ఎదుర్కొని త్యాగంచేశారు. ఈ త్యాగంలోనేవుంది వీళ్ళ వీరకృత్యం. వీళ్ళల్లో యువకులున్నారు - మధ్యవయస్సు వాళ్లున్నారు. వృద్ధులూవున్నారు. ఒక మగవాళ్లేకాదు, స్త్రీలూ ఇందులో చేతులుకలిపి త్యాగధనులయ్యారు. మనమీ రహస్యాన్ని నేడు అర్థంచేసుకోకపోయినా, రాబోయే తరం ఈ త్యాగఫలాన్ని తప్పక అనుభవిస్తుంది. వీరి త్యాగాన్ని వేనోళ్ల మననం చేస్తుంది.

◆ ◆ ◆

మా బాల్య దినాల్ని గడిపింది ఒక చిన్న గ్రామంలో. రైలుస్టేషను మా వూరికి చాలా దూరంలోవుంది. ప్రపంచాన్ని గురించి ఆ రోజుల్లో మేము తెలుసుకొన్నది తపాలుకోచి స్టేషనునుంచి మా వూరికి రావటం, మా వూళ్లోవాళ్లు పనిపాటలమీద రైలుస్టేషనుకు వెళ్లటం. అంతకన్నా ప్రపంచం సంగతి మాకేం తెలిసిందికాదు. మా నాన్న ఆ వూరికి పెద్ద. ఆయనా ఈ గ్రామంలో పుట్టి పెరిగినవాడే. ఈ వుద్యోగానికి వచ్చాక శాయశక్తులా ప్రయత్నించి ఈ అయోమయావస్థలోనుంచి గ్రామ

స్థులకు తరుణోపాయాన్ని కల్పించటానికి మా వూరి వరకూ రైలును వేయించాడు. ఇందుమూలంగా మా వూరూ కొన్నేండ్లయ్యాక చిన్నపట్టణంగా మారి పోయింది. బయటి ప్రపంచంతో అప్పటినుంచీ సంబంధ బాంధవ్యాలు యెక్కువయ్యాయి. అప్పటి నుంచే ప్రపంచం అనేది ఒకటి వున్నదనీ, ధానిలోని భాగమే మేమూ అని అర్థంచేసుకొన్నాము.

మా వూళ్లో మేము చదవవలసిన విద్యనంతా పూర్తిచేశాము. ఇక పెద్ద చదువులకోసం క్రొత్త చోటికి వెళ్లాలి. ఉల్మ మా వూరికన్నా పెద్దది. దాన్ని గురించి విన్నామేగాని ఇంతవరకు చూడ లేదు. అక్కడ పురాతనపు దేవాలయం ఒకటుంది. దాని ఘంటానాదం మా వూరికీ అహోరాత్రాలు విన బడుతూనే వుంటుంది. ఇప్పుడు మా వూరికే రైలు పడింది. అక్కడ మా చదువుకు అనుకూలమైన ఉన్నత విద్యాలయంవుంది. ఇంట్లో మా నాన్నకు అయిదుగురు బిడ్డలం. ఈ రైలుబండిలోనే అను దినం ప్రయాణంచేస్తూ ఉల్మ పట్టణంలో మా చదువు లను ప్రారంభించాము. మా వూరినుండి అక్కడికి ప్రొద్దున్నే బయలుదేరి వెళ్ళడం, మధ్యాహ్నం పాఠాలన్నీ పూర్తిచేసుకొన్నాక ఇంటికి రావటం మా దినచర్య. ఉల్మ అన్ని ప్రాంతాలకు వెళ్లే రైలుబండ్లకు రహదారి. స్టేషను ప్లాటుఫారంమీద అన్నిరకాల మనుష్యులనూ, మా దేశంవారిని, పరాయిదేశంవారిని అనుదినం మా రాకపోకల్లో చూస్తూవుండేవాళ్లము.

♦ ♦ ♦

ఒక రోజున స్కూలుకు వెళ్లాను. మేడమీద నున్న మా క్లాసు గదిలోకి నడుస్తూ వున్నప్పుడు మా స్నేహితురాలు నన్ను మెట్లదగ్గర కలుసుకొని "హిట్లరు అధికారంలోకి వచ్చాడు" అని ఎంతో వుత్సాహంతో అంది. నాకూ ఆ సంగతి తెలుసు. నిన్నరాత్రి రేడియోలో ఆ వార్తను విన్నాను. ప్రొద్దున పత్రికల్లో చదివాను. ఆ కబుర్ను చెప్పి పూరకవున్నదా "హమ్మయ్యా! ఇక మనదేశం బాగుపడుతుంది. దేశరథాన్ని ఆయనే చక్కగా నడుపుతాడు. దాంతో మన రాజకీయపరిస్థితులూ బాగుపడతాయి" అని చెప్పింది.

రాజకీయాలంటే ఏమిటో ప్రారంభాన తెలుసు కోడం ఆ రోజునుంచే! తమ్ముడు హాన్స్‌వయస్సు 15 సం॥రాలు. చెల్లిసోఫీవయస్సు 12 ఏండ్లు. దేశ భక్తిని గురించి ఆ రోజునుంచే అందరూ మాట్లాడడం. నాయకుల స్వార్థపరత్వంవల్ల దేశం పాడయిపోయిం దనీ మన మందరమూ కలిసిమెలిసి పనిచేస్తేనేగాని ప్రజలు బాగుపడరనీ, దేశపరిస్థితులు చక్కపడవనీ ఆనాటినుంచే ప్రచారం సాగడం ఆరంభమయింది. స్కూల్లో దీన్నే వినడం. స్కూలు భవనంనుంచి బయటికి వచ్చామా, అందరూ దాన్ని గురించే మాట్లాడుకోడం.

దేశాన్ని ప్రేమించడమనేది మానవుని రక్తనాళా ల్లోనే వుంటుంది. తన దేశ ప్రకృతి చిత్రాల్ని చూశాడా-తన్మయుడైపోతాడు. ఈ వాతావరణంలో పుట్టి పెరిగాము. మా పూర్వులు శాయశక్తులా ఈ భాగ్యాన్ని పోషించి ధన్యులయ్యారు. ఆ సంగతి మాకూ తెలుసు. ఈ విషయాన్ని గురించి ఇప్పుడు ఇంత పటాటోపం చేయడమెందుకు? ... హిట్లరు ఇవ్వాళ నాయకుడయ్యాడు. దేశం దౌర్భాగ్య స్థితిలో వున్నట్లు, దాన్నుంచి ప్రజాసముదాయానికి తరుణోపాయాన్ని చూపెట్టడానికి హిట్లరు అవత రించాడని చిన్నలూ పెద్దలూ చెప్పుకోడానికి ఆరం భించారు. అందరికీ పనిపాటలను చూపెట్తాడని, అంచేత కడుపారా భోజనం లభింస్తుందనీ వేలం వెర్రిగా ప్రచారం చేయసాగారు. బాగుపడడం అందరికీ ఇష్టమే. బహునాయకత్వంనుంచి విముక్తిని వాంఛించడం మంచిదే. దాన్ని వద్దని ఎవరంటారు? ... ఈ స్వాతంత్ర్య నినాదాన్ని విన్నాక ఈ దోవ లోనే నడుస్తూ దేశసేవచేయాలనే వుద్రేకం మాకు హెచ్చుపెరిగిపోతూంది. హిట్లరు రాజ్యచక్రాన్ని తన చేతుల్లోకి తీసుకొన్నప్పటినుంచి ఇక పండుగుల పర్వాల విషయం వివరించనక్కరేలేదు. ఏవూళ్లో

చూసినా వుత్సవాలే. యువకులు జండాలు పుచ్చుకొని దేశభక్తి గీతాలును పాడుతూ వీధుల్లో తిరుగుతూ చూపవలసిన వుద్రేకాన్నంతా చూపెట్టుతున్నారు. హిట్లరిని ప్రతిఘటించిన వాళ్లందరూ మటుమాయమైపోయారు. ఇక ఆయన్ను నిరోధించే వాళ్లు ఎవరున్నారు? దేశాన్ని పీల్చి పిప్పిచేస్తూ వున్న విషమావస్థలన్నిటిని నిర్మూలిస్తాడు. భాగ్యవంతులూ బీదసాదులూ అనే తారతమ్యం ఇక వుండదు? హిట్లరు కట్టుబాట్లలో అందరూ వినయ విధేయతల్తో వుంటూ, ఆయన తలపెట్టిన కార్యాల్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి ముందంజ వెయ్యాలి. ఇదే, దేశీయుల బాధ్యత. పెద్దలు ఈ విషయంలో తటపటాయిస్తూ వుండినా, యువకులు తమ విధ్యుక్త ధర్మాన్ని ఏమాత్రం మరచిపోకూడదు. ఇదే స్కూల్లో మాకు పంతుళ్లు ప్రతిరోజూ చెప్పే పాఠం.

యువకులు అందు ముఖ్యంగా విద్యార్థులు, విద్యార్థినులు, ఈ కార్యకలాపంలో పాల్గొని అహోరాత్రాలు తమ ధర్మాన్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి యువక సంఘాలు స్థాపింపబడ్డాయి. మేమందరం ఈ సంఘాల్లో చేరాము. తోడి మిత్రులనూ, మిత్రురాండ్రనూ "ఈ సంఘాల్లో చేరి సేవచేయాలని" ప్రోత్సాహంచేశాము. వాటిలో చేరడానికి తటపటాయించేవారిని రాజద్రోహులునుగా చూడడానికి మొదలు పెట్టాము. ఆ రోజుల్లో మాలో జనించిన ఆ వెర్రి వుద్రేకాన్ని, వుత్సాహాన్ని తలచుకొంటే మాకే ఆశ్చర్యంవేస్తుంది.

మేమింత వుర్రూతలూగుతున్నా మా నాన్నకు మాత్రం మా వైఖరి ఎంతమాత్రం నచ్చిందిగాదు. దానికి కారణాన్ని చెప్పడు. తన పనేమో, తనేమో తప్ప ఇతర విషయాల్లో అనవసరంగా జోక్యం పుచ్చుకోడం నాన్న తత్త్వంకాదు ... కాని ఒక రోజున ఇంట్లో హిట్లరును గురించి మేము వుత్సాహంతో చెప్పుకొంటున్న కబుర్లను సావధానంగా విన్నాడు. నాన్ననూ ఈ చర్చల్లో పాల్గొనమని నిర్బంధించాము. ఆయన ప్రపంచంవేరు; మా ప్రపంచంవేరు. అయితేనేం, మా మాటలను సావధానంగా విన్నాక "మీరంతా అమాయకులు ఆయన మిమ్మల్ని తన కార్యాల్ని సాధించుకోడానికి వుపయోగించుకొంటాడు. ప్రజాకోటిని అనవసరంగా అయోమయ సముద్రంలోకి ఈడ్చుకొనివెళ్ళి బాధిస్తాడు" అని అన్నాడు. పైగా హిట్లరును వూళ్లో వున్న ఎలుకలును పట్టుకోడానికి వచ్చిన మనిషితో పోల్చాడు. ఆ కథ మాకు తెలుసు. ఆ మనిషి ఎలుకల్ని నీళ్ళలోకి దించాడు. అంతేకాదు; వూళ్లో పిల్లలందరినీ అలాగే మాతమార్చాడు ... నాన్న చెప్పిన ఈ పోలిక మాకు నచ్చిందికాదు. ఆ మనిషివేరు - హిట్లరువేరు. హిట్లరు అవతారమూర్తి. ఆయన్ను ఈలా పోల్చడం సబబుకాదని నాన్నతో వాదించాము. కాని నాన్నధోరణి ఒక పంథాలో నడుస్తుంది. దానినుండి ఆయన్ను మార్చడం మా తరమయిందికాదు.

మా వూళ్లో హిట్లరు యువక సంఘం నెలకొల్పబడింది. యువకులందరూ దీనిలో సభ్యులుగా చేరారు చుట్టుప్రక్కలనున్న ప్రాంతాలిని చూడడానికి సంఘనాయకుడు మమ్మల్ని తీసుకొని వెళ్లాడు. మేమున్న ప్రాంతం కొండ ప్రదేశం, అడవిమయం. ప్రకృతిశోభను ఇక్కడే తనివితీర చూసి ఆనందించవచ్చు. ఈ ప్రదేశంలో నడవడం అంత సులభము కాదు. ఇంతవరకు మా ఇల్లు, మా బడితప్ప మరే ప్రపంచాన్ని చూడడానికి అవకాశంవుంటేకదూ! మేము హిట్లరు యువక సంఘంలోచేరాక, మా నాయకులు సెలవు రోజుల్లో విధివిరామంలేకుండా అన్ని ప్రాంతాలకి తీసుకొని వెళ్లేవాళ్లు. అన్ని దృశ్యాల్ని తనివితీరచూస్తూ ఆనందించేవాళ్ళము. ఈ ప్రయాణాల్లో విధివిరామంలేక నడవాలి. నడచి, నడిచి అలసిసొలసిపోయేవాళ్ళం. అయితేనేం-ఇట్టి యాత్రల్ని చేస్తూవుంటే ఎక్కడాలేనిశక్తి వచ్చేది. మాతో సంచారంచేసేవాళ్లు మా వయస్సువాళ్లే. వాళ్ళతో పరిచయభాగ్యం లభించింది. మాకీ వయస్సులో కావలసింది ఇదే. దాన్తో ప్రయాణపుబడలికను పూర్తిగా మరచిపోయేవాళ్ళము. ...

ఈలా ఈ మిత్రుల్ని కలుసుకోడం సెలవుదినా

ల్లోనేకాదు. ప్రతిరోజూ, సాయంకాల సమయంలో మా సంఘపు సభలు జరుగుతూవుండేవి. అక్కడా అందరము సమావేశమవుతూ, కబుర్లను చెప్పుకొనే వాళ్ళము. పాటల్ని పాడేవాళ్ళం. చేతిపనుల్ని యెన్నిటినో అందరముకలిసిచేసుకొనేవాళ్ళము.

ఇంత అదృష్టం మా వయస్సు పిల్లలకు సామాన్యపు దినాల్లో వుంటుందా? హిట్లరు యువకసంఘం దేశంలోవున్న పిల్లల సంస్థల్లోకల్లా పెద్దది. దీని శాఖలు దేశమంతటా నెలకొల్పబడ్డాయి. మా నాయకుడు హిట్లరు. ఆయన అదుపాజ్ఞల్లో మెలగుతూ, ఆయన తలపెట్టిన కార్యాన్ని నిర్విఘ్నంగా కొనసాగించటానికి ఈ సంఘంలోచేరినందున మాకూ అవకాశం దొరకింది. ఇంతకుముందు ఏ పెద్దలో కొందరుచేరి మా దేశపు రాజ్యచక్రాన్ని తమ పంథాలోనే తిప్పేవారు. ఇక ఇప్పుడో? పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. మా నాయకుడు, ఆయన చుట్టుప్రక్కలనున్న వాళ్ళే కాదు. అందరూ, అందులో పాల్గొని పనిచేయడానికి అవకాశ భాగ్యాన్ని ప్రసాదించాడు. తటపటాయించక, ఆ పనిని చక్కబెట్టుకోడానికి ముందంజవేయాలి. అప్పుడే ఈ యుద్యమం జయప్రదంగా కొనసాగుతుంది ... ఈ సభల్లో మేము వినేది దీన్నే. మా పాఠశాలల్లో నేర్చుకోవలసింది - ఈపనిని నిర్విఘ్నంగా కొనసాగించుకోడానికే అత్యవసరమైన శిక్షణ. యువక సంఘాలూ ఆ శిక్షణనే పాఠశాలావరణంలోనుంచి బయటికి వచ్చాక సొంతంగా చక్కబెట్టడానికే స్థాపింపబడ్డాయి. ... ప్రచారాన్ని నమ్మాము.

ఒక రోజు సాయంకాలం, సైకిళ్ళమీద చుట్టుప్రక్కల ప్రాంతాల్ని చూసివచ్చాక మా శిబిరంలో సమావేశమయ్యాము. అది విశాల ప్రదేశం. ఆకాశంలో నక్షత్రాలు దేదీప్యమానంగా కాంతినిస్తూ వున్నాయి. మేమందరము ముచ్చట్లు చెప్పుకొంటూ ఆ తేజాన్నిచూస్తూ ఆనంద సముద్రంలో మునిగిపోయి వున్నాము. నా ప్రక్కనే పండుకొనివున్న పదిహేను సంవత్సరాల అమ్మాయి నాతో మెల్లిగా అంది. "అంతా బాగానేవుంది. కాని పాపం, ఆ యూధుల్ని ఆలా క్షోభపెట్టడం మాత్రం మంచి దేనామరి?" అని. మా సంఘపు నాయకురాలు ఈ పిల్ల అంటున్న మాటనువింది. "దీనికోసం ఈలా తాపత్రయపడడం మనకు సబబుకాదు. ఈ సంగతి హిట్లరుకు తెలుసు. ఆయన చేస్తూన్నపని సామాన్యమయిందికాదు. ఆ సందర్భంలో కష్టనిష్ఠూరాలు వుంటాయి. వాటికోసం మనము ఆలా తబ్బిబ్బవడం తప్పు" అని జవాబిచ్చింది. ఆ పిల్ల ఈ జవాబుకు తృప్తిపడిందికాదు. ఇతర పిల్లలూ ఈ సంభాషణలో పాల్గొంటూ తమ ఇండ్లల్లో ఈ సంగతిని గురించే పెద్దలు ఆతురతను చూపెట్టుతున్నారని అన్నారు ... రాత్రంతా ఈ విషయాన్ని గురించే చర్చించుకొంటూ వున్నందువల్ల, ఆ నాటి ఆనందం ఇంకోరూపంగా పరిణమించింది. నిద్రపట్టలేదు - కండ్లు మూసుకొన్నా యూధుల్ని గురించి వింటున్న విషాదగాథల్ని ఏలా మరచిపోగల్గుతాము? ... ఎలా అయితేనేం తెల్లవారింది. మర్నాటి కార్యకలాపాల్లో మునిగిపోయాక, ఆ నాటిరాత్రి మేము విన్నగాథల్ని కొంతవరకు మరిచిపోయాము. ... అవును, తాత్కాలికంగా వాటిని మరిచిపోయాము.

మాలో అభిప్రాయ భేదాలు ఈలా పలు రూపాల్తో పెచ్చుపెరిగిపోతున్నా ఇంతమంది మిత్రుల్తో కలిసి మెలసి వుండడంచూస్తే మా సంతోషము నానాటికి గాఢంగా నాటుకొనిపోయింది. స్నేహం అంటే ఇంతకన్నా మరేం వుంటుంది! ఇల్లాటి అదృష్ట భాగ్యం మా వంటి పిన్నవయస్సు వాళ్ళకి సాధారణంగా లభిస్తుందా?

♦ ♦ ♦

హాన్స్‌కు జానపదాల్ని సేకరించడం అంటే సరదా. వాటిని తన వాద్యయంత్రం మీటుతూ పాడుతూ వుంటే మైమరచేవాడు. వాడు సేకరించిన జానపదాలు అన్ని దేశాలవి. వాటిని వాడి నోటినుంచి వింటుంటే మాకు చాల ఆనందంగా వుండేది. జానపదాలు ప్రజల మనోతత్త్వాన్ని చక్కగా చిత్రిస్తాయి. వాటిని వింటుంటే ప్రపంచాన్నే విశాల దృష్టితో అర్థంచేసుకోవచ్చు. ఆలా అర్థం చేసుకొంటిమా, మనమూ

వాళ్లూ అనే భేదం మనలో అంకురించదు? అందరిలో ఆశ ఒకటే. ఇది ఎంతవికాసవంతంగా జానపదాల్లో ప్రకటింపబడుతుంది! మా దేశపు పాటల్ని తప్ప మరే జానపదాల్ని పాడకూడదని మా సంఘంలో కట్టుబాట్లు వున్నాయి. కాని హాన్స్‌ది యీ కట్టుబాట్లకి దాసుడయ్యే ఘటంకాదు.

కాలచక్రం గిరగిర తిరిగిపోతూనేవుంది. దీంతో హాన్స్ మనోతత్త్వమూ చాలా మారిపోతూనేవుంది. వయస్సులో పెద్దవాడయ్యాడు. చెప్పరాని క్షోభ వాడి విశాలహృదయాన్ని పీల్చి పిప్పిచేస్తోంది. నాన్న ఆ రోజుల్లోఎంత బాధపడుతూవున్నా, వాడికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ఇచ్చాడు. అధవా పొరపాటున వాడు నడిచే దోవ మంచిది కాదని నాన్న అన్నా, వాడు ఆ మాటను వినేవాడే కాదనుకుంటా.

వాడి క్షోభకి కారణం ఉంది. ఇతర దేశాల జానపదాలు హిట్లరువర్గానికి నచ్చవని, ఆ దేశాల జానపదాలు ఎవరు పాడకూడదని యువక సంఘం వారు హాన్స్‌తో చెప్పారు. ఆమాట విన్నాక వాడు పక్కున నవ్వాడు. దానికి సంఘపునాయకుడు మండిపోయాడు. తన ఆజ్ఞను అంత తిరస్కారభావంతో నిరాకరించినందుకు హాన్స్‌కు పెట్టబడిన కష్టాల్ని పడ్డాడు. ఎన్ని కష్టాల్ని ఎదుర్కోవలసివచ్చినా హాన్స్ తన పట్టును ఏ మాత్రం వదలిన వాడు కాడు. ఈ పాటలు మంచివి. వాటిని వింటుంటే, స్వయంగా పాడుతుంటే, హృదయానికీ ఎంతో ఆనందాన్ని, ప్రశాంతిని ప్రసాదిస్తున్నాయి. ప్రపంచ వాసులందరూ కలిసి మెలసి వుండాలంటే ఇవే మనకి సహాయపడ్తాయి.. అట్టి వాటినిపాడకూడదని శాసించడం ఏమాత్రం సబబుగాలేదు - ఇదే హాన్స్‌వాదం. దాన్ని విని తృప్తిపడటానికి ఆ రోజుల్లో ఎవరికి ధైర్యం వుంది? సాహసంవుంది? వాళ్లదోవవాళ్లదే. తాము పట్టుకొన్న కుందేటికి మూడే కాళ్లు అనే వాళ్లతో వాదించినా లాభంవుండదు.

ఆ విపన్మావస్థలోనే మా పూర్తి యువక సంఘం పక్షాన నూరన్‌బర్గ్ నగరంలో జరుగబోయే నాజీ కాంగ్రెసు సభలకు ప్రతినిధుల్ని కొందరిని పంపటానికి ప్రయత్నాలు జరుగుతూ వున్నాయి. హాన్స్ మనోభావాల్ని వాళ్లకు తెలిసివున్నా, వాడ్నే ఒక ప్రతినిధిగా నియమించారు. అంతేకాకుండా మా సంఘపు పతాకాన్ని ఆ సభలకు తీసుకొని వెళ్లవలసిన బాధ్యత వాడిమీదే పెట్టారు. ఈ సంగతి విన్నాక వాడి ఆనందాన్ని ఇక చెప్పాలా!... ...నూరన్‌బర్గులో సభలు జయప్రదంగా జరిగాయి. తన కార్యకలాపాన్ని సవ్యంగా చక్కబెట్టుకొని హాన్స్ ఇంటికి వచ్చాడు ఆ వెళ్లేటప్పుడువున్న వుత్సాహం,వుద్రేకం మటుమాయమయి పోయాయి. అలసిసొలసివున్నాడు. ఎవరితోనూమాట్లాడడు.ఏదో బాధ వాడ్ని వేధిస్తూంది. మేమూ వాడ్నిప్రాధేయపడి అడిగాము. కానిఅంతా నిష్ఫలం·· ...ఆశాభంగం. ఇదే వాడిమొహంలో ప్రత్యక్షం ......క్రమేణ దీన్నే వాడినోటినుంచి విన్నాం యువకోద్యమ మెన్నో వున్నతాదర్శాలతో నడవాలనే ఆశ హాన్స్‌లో గాఢంగా నాటుకొనిపోయింది. యువకలోకం సహజంగా స్వాతంత్ర్యాన్ని వాంఛిస్తూ వుంటుంది. ఆ వాంఛల్ని కార్య రూపంలో బెట్టడానికి తబ్బిబ్బులాడుతుంది. యువకులందరూ, ఏ ప్రాంతాలనుంచి ఆ సభలకు వచ్చినా, ఇట్టి అదర్శాల్లో నేమునిగి తేలుతున్నారని హాన్స్ తలచాడు·· ...సభల కాలంలో తనుకండ్లార చూచిన దృశ్యాల్లో · ...డ్రిల్లు డ్రిల్లు, అహోరాత్రాలూ ఇంతే. మానవుడు ఈ కట్టుబెట్టాల్లో తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా మన్నుపాలు చేసుకొన్నాడు. పైవారు ఆజ్ఞాపించడం, దాన్నే మిగతావారంతా మక్కీకి మక్కీగా అనుకరించాలని నిర్బంధం. అందరూ తమకు స్వాతంత్ర్యం కావాలని వుపన్యాసాల్నియ్యడం. ఒకటి రెండూ కాదు అహోరాత్రాలు వీటినే వినాలి......కాని వాటిని కార్యాచరణలో బెట్టేవారో? అందరూ మందలో గొర్రెల్ని కాపరి ఏరీతిని నడిపిస్తే అలాగే, తటవటాయించక అనుసరిం

చాలు! వ్యక్తి స్వాతంత్ర్యానికి ఇక అవకాశ మెక్కడినుంచి వస్తుంది? ఆత్మవిశ్వాసం వుంటేనే గాని పని ఏమాత్రం జరుగజాలదని ప్రగల్భాలు. ఆత్మే పూర్తిగా నశించిపోతున్నప్పుడు ఈ పటాటోపం అంతా ఎందుకు వచ్చింది? ఇదే హాన్స్‌ను ఆ సభలనుంచి ఇంటికి వచ్చినప్పటినుంచి పీల్చి పిప్పి చేస్తున్న బాధ. అట్టిపంధాలో నడిచేవాళ్లు ఇట్టి తాపత్రయాన్నుంచి విముక్తులు కావడం అంత సులభసాధ్యమైన కార్యమా?

◆ ◆ ◆

ఇంటికి వచ్చాక, ఈలా బాధ పడుతూ వున్న కాలంలోనే హాన్స్ మరోగండాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. జానపదాల్ని పాడకూడదని శాసించిన నాయకుడే హాన్స్, స్టెఫెన్ చయిగ్ వ్రాసిన "మానవ జీవితంలోని ఆశాకిరణాలు" అనే పుస్తకాన్ని చదవడం ఒకనాడు చూశాడు. ఆ పుస్తకాన్ని ప్రభుత్వం నిషేధించింది! దాన్ని వాడు చదువకూడదని శాసించాడు. ఆలా చదవడంలో తప్పేముంది? అని హాన్స్ ఆయన్ని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు జవాబివ్వక ఆ నాయకుడు మరి కొంతమంది రచయితల్ని పేర్కొంటూ వారి గ్రంథాల్ని చదవడం రాజద్రోహమని అన్నాడు. ఇట్టి రచయితలకు ఆ నూతన వాతావరణంలో స్థలం వుండనీయడం మహోపద్రవమని చెబుతూ వుపన్యాసాన్ని ఇచ్చాడు......చ్వగ్ జర్మను దేశాన్నుంచి ఆ రోజుల్లో పరాయి దేశాలకు వలసపోవలసివచ్చింది. ఆ మహనీయుడు చేసిన మహాపరాధం "ప్రజలందరు కలిసి మెలిసి వుండాలని, తద్వారా శాంతిని చిరస్థాయిగా నిలపాలని" తన రచనల్లో వాంచించటమే! ఇట్టి అపరాధాన్నే చేసిన మరి కొందరు రచయితలు కారాగారాల్లో అష్టకష్టాల్ని అనుభవించవలసి వచ్చింది. ఇక కొంతమంది అండర్ గ్రవుండు (అజ్ఞాతవాసం)లో తమ ప్రాణాల్ని దక్కించుకోవలసి వచ్చింది. వారి రచనల్ని బహిష్కరించారు. అంతేకాదు వేలకొలది గ్రంథాల్ని అగ్నిదేవునికి ఆహుతిచేశారు .....

ఈ గండంతో ఆ ఘట్టం పూర్తిఅవలేదు. గోరుచుట్టుమీద రోకలి పోటుపడ్డ మాదిరిగా, మరో వుపద్రవాన్ని హాన్స్ ఎదుర్కోవలసివచ్చింది. హాన్స్ యువకసంఘంలో కార్యనిర్వాహక సభ్యుడు. సంఘపు పతాకాన్ని జాగ్రత్త పరచడం వాడిపని. ఆ పతాకమూ అంత చిన్నదికాదు. సంఘపు సభల్లో అది ఎగురుతూ వుంటే దాన్ని చూసే తీరాలి. దాని మీద జర్మను గాథల్లోని జంతువు బొమ్మను చిత్రించారు. ఈ సభల్లో మేమందరం సమావేశమైనప్పుడు, ఆ పతాకం గాలిలో చక్కగా ఎగరుతూ వున్నప్పుడు దానిచుట్టూ నిలబడి జాతీయగీతాల్ని పాడాలి. భక్తి విశ్వాశాల్తో మా మా విద్యుక్తధర్మాల్ని నిర్విఘ్నంగా కొనసాగించు కొంటామని ప్రతిజ్ఞ చేయ్యాలి.... ......ఒకరోజు సాయంకాలం మామూలు ప్రకారం మా సంఘ సభకు సమావేశమయ్యాము. పతాకం ఎగురుతూంది.........హాన్స్ దాని దగ్గరే నిలుచున్నాడు. నాయకుడు "వాడ్ని అక్కడినుంచి వెళ్లిపొమ్మని ఆజ్ఞాపించి, మరో కుర్రవాడ్ని — హాన్స్‌కన్నా వయస్సులో ఎంతో చిన్నవాడిని — పిలిచి, ఆ పనిని చక్కబెట్టుకొమ్మని శాసించాడు......ఈ మాట విన్నాక హాన్స్ స్తంభించి పోయాడు. తనుచేసిన తప్పేమని నాయకుడ్ని అడిగాడు. ఆలా సాహసం చేసి అడిగినందుకు నాయకుడు వాడిమీద మండి పడ్డాడు. ఇది ఆజ్ఞ అట్టి ఆజ్ఞను ధిక్కరించకూడదు......హాన్స్ అంటే అందరికీ ఇష్టం. వాడు మితభాషి. ఇతర్ల విషయాల్లో ఏమాత్రం జోక్యం పుచ్చుకొనేవాడుకాదు. తన పనేమో అంతే......ఈ సంగతి సంఘంలోని సభ్యులకు బాగా తెలుసు. అంచేతనే నాయకుడు ఎంత ఆజ్ఞాపించినా ఆ కుర్రవాడు ముందంజ వేయలేదు. హాన్స్ తను నిలుచున్న స్థలాన్నుంచి కదలలేదు. నాయకుడు మరొకసారి ఆజ్ఞాపించాడు......కాని లాభంలేక పోయింది. అందరూ ఈ దృశ్యాన్ని చూస్తూ విభ్రాంతులయ్యారు. కాని వారేం చేయగల్గుతారు? నాయకుని మొహం ఈ విషమావస్థలో చూసేతీరాలి. తన అధికారాన్నంతా చూపెట్టాడు. కాని లాభమేం? ఎంత చేసినా హాన్స్ అక్కడినుంచి కదలితేకదూ?......హాన్స్ దేహం కంపించి పోతూంది. నోటినుంచి మాటలేదు. ఈ రభసను ఎంతకాలం ఓర్చుకోగల్గుతాడు. తనునిలుచున్న స్థలాన్నుంచి తిన్నగా నాయకుడి దగ్గరకు వచ్చాడు. అతణ్ని ఒక్కక్షణం చూశాడు.........ఏం అనుకొన్నాడో? రెండు లెంపకాయలిచ్చాడు. చెవిని మెలివేశాడు......

(సశేషము)

# సూర్యుని వేడిచే వంటలు చేయుటకు ఉపయోగించు కుక్కరు

(డాక్టరు మేరియా టెల్కేసు అను స్త్రీ కనిపెట్టినది)

విదూషక విద్వాన్ ఆకుండి వెంకట శాస్త్రి

1949 సంవత్సరమున అమెరికాలో మెసాచుసెట్సు టెక్నాలజీ ఇన్స్టిట్యూట్యులో పరిశోధనలు చేయుచుండిన డాక్టరు మేరియా టెల్కేసు మెసాచుసెట్సు రాష్ట్రమున డోవరులో ఒక యింటిలో సూర్యుని వేడివలన యిల్లంతయు వెచ్చగనుంచుటకు సాధనచేసెను. సౌరపు స్టవ్వులో మార్పులు కల్గించుటకు గత 100 సంవత్సరాలుగా ప్రకృతి శాస్త్ర పరిశోధకులు కృషి చేయుచునేయున్నారు.

న్యూయార్కు విశ్వవిద్యాలయపు ఇంజనీరింగు కళాశాలలో సౌరపు స్టవ్వులో సూర్యుని వేడిమిని నిలువచేయు విధానమునకు ఫోర్డు ఫౌండేషన్ వారు యీ సౌరపు స్టవ్వులో మార్పులు చేయువారికి గ్రాంటు పూర్వకముగ ప్రోత్సాహమును కల్గింతుమని ప్రకటించిరి.

కట్టె, బొగ్గు, నేలబొగ్గు, కట్టెలు లేనపుడు సూర్యుని వేడిని సూర్యకాంతపు రాళ్ల జోడింపుతో సూర్యుని వేడిని అరికట్టి సూర్యుడు మరుగుపడినపుడును సూర్యుడు ప్రకాశించునపుడును ఆ వేడిమిని నిపుణముగ సూర్యకాంతములద్వారా వేడిమిని నిలువయుంచుటకే ఎన్నియో పరిశోధనలు జరుపుచు వచ్చిరి.

డాక్టరు మేరియా టెల్కేసు 20 సంవత్సరములు గొప్పదీక్షతో పరిశోధన చేసి రిప్లెక్టరను తగ్గించివేసెను. మేరియా టెల్కేసు తయారించిన సౌరపు స్టవ్వులో 300 ఫారిన్‌హీటు డిగ్రీలవేడి చేర్చుటను కనిపెట్టెను.

అమెరికాలో రిసెర్చి విద్యార్థినీ, విద్యార్థి బృందమువారు టెల్కేసు తయారించిన యీ స్టవ్వును 25 రూ. కనీసపు ధరకు ఎల్లరకు లభ్యమగునట్లు తయారింప యత్నించుచున్నారు. ఈస్టవ్వులో అత్యధికమగు వేడి సూర్యునుండి సులభముగ గ్రహించి వంటలు చేయవచ్చునని డిమాన్‌స్ట్రేటు చేయుచున్నారు.

ఈ సౌరపుస్టవ్వు కూరలను వేయించుటకును, వండుటకును సాధ్యపడుచున్నది. సౌరపుకుక్కరు ప్రశస్తమైనది రూ 80 లకు లభ్యపడునట. ఇది శ్రీమతి డాక్టరు మేరియా టెల్కేసు అనువిద్యార్థిని 20 సం॥ల పరిశోధనాఫలితము.

# "రాగవర్ధని"

'విజయ – రాఘవ'

(గతసంచిక తరువాయి)

'అక్కయ్య వస్తోందని' అందరూ అంటూండగానే భువనేశ్వరి రిక్షాదిగి లోపలికి వచ్చేసింది. వస్తూ-వస్తూ తమ్ముళ్లకు - చెల్లాయిలుకు పకోడీ - కారప్పూస పొట్లాలు తెచ్చి వాళ్ల చేతుల్లో పెట్టింది. వాళ్లు తింటూ యెటో ఆడుకోంటానికిపోయారు.

భువనేశ్వరి తనకు తెలిసిన కథంతా పూసగుచ్చినట్లు తల్లితో ముందు చెప్పేసింది. ఆ రాత్రికూడా అక్కడేవుండి తండ్రితోకూడా చెప్పింది. తల్లిని వొప్పించడం తేలికనిపించింది తండ్రికన్నా. ఎలాగైతేనేం "కట్నాలు - కానుకలు తీసికోకుండా రజనీకాంతుడి వివాహం చేయాలి"అని తల్చుకొని ఆ మరునాటినుండీ వివాహ ప్రయత్నాలు జరుపడానికి నిశ్చయించుకొన్నారు.

ఆరాత్రి సన్నజాజి పందిరిక్రింద, యిది వరకు తను వేసుకునే మడతమంచం వేసుకొని పడుకొంది. కాని కంటికి కునుకుపట్టడంలేదు. సగంరాత్రయిందప్పటికి. "తనుచేసిన ఘనకార్యం యేవిధమైన సంతోషంగా మారిపోయిందో" అన్నయ్యకు చెప్పాలని గబుక్కునలేచి, చెప్పులు తొడుక్కొని ఆ మసక మసక వెన్నెల్లో కృష్ణలానా గదిలో అన్నయ్య వుంటున్నాడని, తెలుసుకొని బయలుదేరింది. కిటికీలోంచి లోపలి వెలుగు కనిపిస్తోంది. 'రజనీకాంతుడు యేదో చదువుకొంటున్నాడుగదా' అని అనుకొంది. నెమ్మదిగా గదిదగ్గరకొచ్చింది.

'ఎవరో' మనిషిరావడం శబ్దం, వ్రాసుకొంటున్న రజనీకాంతుడికి క్రమేపీ వినిపించి, తగ్గిపోవడంతో, చేతిలో కలంకూడా వేగంహెచ్చి, తగ్గింది. కాని 'యెవరోలే' అని అంతలోనే అనిపించగానే మళ్లా కలం వేగంతో హెచ్చింది.

కూర్చుతున్న పాటలోకి తీయతీయని పదాలు దొర్లుకొస్తున్నాయి. ఆ భావమంతా తన అనుభూతిని వ్యక్తంచేస్తున్నట్లుగా తోచింది. తనలో తాను కూనిరాగంతో పాడుకొంటూన్నాడు. ఆ కూని రాగాలాపన చిరు తరంగాలు కిటికీలోంచి దూసుకొచ్చి భువనేశ్వరికి కమనీయంగా మారిపోయేటట్లు చేస్తున్నయి. 'అన్నయ్య ఎంత బాగా పాడతాడు' అని యీనాడు యెవ్వరూ చెప్పకుండానే తెలుసుకున్నట్లనిపించింది. 'లోపలికిపోతే యింకా బాగా వినవచ్చుగా' అని 'అన్నయ్యా!' అని పిలుద్దామనుకొంది. కాని, "యిప్పుడు పాడుతున్నట్లు పాడతాడా" అని సందేహం, "అసలు పాడతాడని నమ్మకంయేమిటి" అనే దుగ్ధ రెండూ సమ్మేళించడంతోనే రజనీకాంతుడు యిందాకటికంటే బిగ్గరగా గొంతుసారించి -

"ఏమవుతానో, నే
నేమవుతానో –
మరులునుగొలిపీ
మలయమారుత మవుతానో,
కమ్మని పూదేనెగ్రోలు
తుమ్మెద నవుతానో ‖ ఏ ‖
ఏంచేస్తానో, నే
నేం చేస్తానో –
కావాలని బిగియారా
కౌగిలించుకొంటానో,
మూంతిముదువకే నేను
ముద్దువెట్టుకుంటానో ‖ఏంచేస్తానో‖

చెట్టుచాటు దాగియుండి
చెంగుపట్టుకొంటానో-
బెట్టుచూపి బిగిసిపోతే
బ్రతిమలాడుకొంటానో ॥ఏంచేస్తానో॥

ఏమవుతానో నే
నేమవుతానో -
కళ్లతోడ కవ్విస్తే
కరిగి - సొరిగి పోతానో.
తెలినవ్వులు తొలకరిస్తే
పులకరించిపోతానో ॥ఏమవుతానో॥"

గదిమెట్లమీద కూర్చొని భువనేశ్వరి పాటంతా విన్నది.

"మా అన్నయ్యకు యెటువంటి కోర్కెలున్నయి? రాగవర్ధని అంటే వాడికెంత యిష్టం! కళ్లతోడ కవ్విస్తే కరిగిపోతాడట! నవ్వితేచాలట ఒళ్ళంతా పులకరించిపోతుందట! బెట్టుచూపి బిగిసిపోతే బ్రతిమలాడుకొంటాడట. రాగవర్ధనే సర్వస్వం అని నమ్మివేశాడు. యీ పాటబట్టి వాడి మనస్సెట్లా వుందో తెలుస్తోంది. ఆమె అంటే యింత యిదిగా వున్నప్పుడు వాడ్ని వేరుగాతల్చి, మరొక పిల్లనిచ్చి పెళ్లిచేయడం నిజంగా వాడిపట్ల ద్రోహంచేసినట్లుగానే వుండేది. నిలువునా వాడి జీవితం నాశనం చేసిన వాళ్ళమయ్యేవాళ్ళం" అని అనుకొంటూండగా పాటక్రమేపీ తగ్గిపోయింది. భువనేశ్వరి మెల్లిగా లేచి, తలుపుతట్టుతూ —

"అన్నయ్యా" - అంది.

రజనీకాంతుడు తన ప్రణయోన్మాదపు మధుర సంగీతంలోంచి తెప్పరిల్లి -.

"ఎవరూ" అన్నాడు.

"నేనేగా ... భువనను" అంది.

చటాలున వెళ్ళి తలుపుతీస్తూ - రజనీకాంతుడు.

"ఇదేమిటే! యింత అర్ధరాత్రిపూట వచ్చావ్". అన్నాడు.

"రావడం నాల్గుగంటలకే వచ్చాను. అమ్మ - నాన్నతో మాట్లాడి, భోజనాలయ్యేటప్పటికి యీ వేళయింది. ఒకసారి నిన్ను చూసిపోదామని వచ్చాను." అంటూ లోపలికివచ్చి చూసేటప్పటికి, టేబిల్ మీద వెలుగుతున్న దీపకాంతిలో మంచం మీద నిద్రపోతున్న రాగవర్ధన్ని ముఖం కళకళ లాడుతూండటం చూసి -

"అన్నాయ్! యిదేమిట్రా" అంది ఆశ్చర్యంగా.

రజనీ అనుకొంటూనే వున్నాడు - ఆ ప్రశ్న తప్పకుండా అడుగుతుందని.

"ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. అందులో నువ్వారగందేముంది" - అన్నాడు చిరునవ్వుతో.

"ఎంతచేసుకోనే అమ్మాయినైతే మాత్రం పెళ్లి కాకముందే యీ విధంగా సాకుతుంటే యెవరేమను కొంటారో - తెలుసా!"

"భువనా! యీ సంగతి యీ చుట్టుప్రక్కల వాళ్ళందరికి - మనలో కొందరికి తెలుసు. నీకూ యీ మధ్యే తెలిసింది. అదెలాగో నాకు తెలుసు. పెళ్లయిన తరువాత సాగించే బ్రతుకుని యెప్పుడే పెళ్ళయిందని అనుకొని సాగిస్తున్నాం. యిందులో నువ్వుగాని, లోకంగాని వింతగా చూడవల్సిందేమీ లేదు. మీ అందరి చూపుల కేంద్రీకరణలో నేను మంగళసూత్రం కట్టినప్పుడే అది పెళ్ళి అవటం అని పించుకొంటుందంటావ్. ఆ విషయాన్ని నేను కాదన లేను. దాన్ని నేను విమర్శించను. అందరి సమక్షంలోజరిగి, వారి హస్తాక్షితలు మేంధరించి, తలంబ్రాలు పోసుకోవడం పెళ్ళి అనిపించుకొంటుందంటావ్. దాన్ని నేనొప్పుకొంటాను. కాని అది తప్పని నేనను.యెవరికీ యిష్టంలేనిది నాకిష్టమైనప్పుడు, నాకు, నా కిష్టమైనదానికి, సహాయ సంపత్తులు లేనప్పుడు ఒండొరుల ఆత్మలే పరిణయానికి సాక్షి. పంచభూతాత్మకమైనది - చరాచర సృష్టిలయకారియై

ప్రకృతే అందరికంటే యెక్కువ సాక్షిభూతం. ఆ దృష్టిలోనే రాగవర్ధన్ని నేను యెన్నడో వివాహం చేసుకొన్నాను.

ఈ సంభాషణ యిలా సాగుతూండగా రాగవర్ధనికి కొంచెం మెలకువవచ్చింది. యేవో మాటలు తనకు సంబంధించినట్లుగా వినబడటంతో లేచి కూర్చొంది.

భువనేశ్వరి వూరుకోక - 'వదినా' - అంది.

రాగవర్ధని కళ్ళు నులుముకొంటూ, మంచందిగి, యేమనిపల్కరించాలో అర్ధంకాక తికమకపడుతూ క్రిందచాపమీద చతికిలపడింది.

'వదినా' అనే టప్పటికి రజనీకాంతుడికి సంతోషంకలిగింది. కాని హేళనగా అనడం కాదు గదా అనిపించింది.

రాగవర్ధని ప్రక్కనవున్న కూజాలో కాసిని మంచినీళ్లు త్రాగి -

"ఎంతసేపయిందండీవచ్చి" అని పల్కరించింది.

భువనేశ్వరి కల్మషంలేని హృదయిని కాబట్టి -

"ఇప్పుడే వచ్చానమ్మా" - అంది నవ్వుతూ.

"మా సువర్చల బాగుందా" అని అడిగింది రాగవర్ధని.

"ఆ బాగా నేవుంది" - అంది.

"ఇంత ప్రొద్దుపోయిన తర్వాత వచ్చారేం"

"నాల్గుగంటలకే మా అమ్మగారింటికొచ్చాను. రేప్రొద్దున్నే మళ్ళా వెడతాను. చూసి వెడదామని వచ్చాను. సమయానికి నువ్వుకూడా వున్నావ్. సరే యిద్దర్నీచూసినట్లుకూడా అయింది. పెళ్ళికాక ముందే ... " అంటూ భువనేశ్వరి రాగవర్ధని భుజం మీద చెయ్యివేస్తూ - రజనీకాంతునివంక చూస్తూ -

"అన్నయ్యా !" - అంది.

రజనీకాంతుడు సిగరెట్ ముట్టిస్తూ 'ఏమి టన్నట్లు చూశాడు.

"నీతో ఒక విషయం చెబుదామని వచ్చారా!" అంది భువనేశ్వరి.

రాగవర్ధనికి యేదో అనిపించింది. అది యిది మిద్ధంగా లేదు.

రజనీకాంతుడు వినడానికి ఆత్రుతపడుతూ -

"ఏమిటే భువనా !" - అని అడిగాడు.

"జాగ్రత్తగా వినాలిమరి. 'ఊ' కొట్టంగానే సరిగాదు. ఒకవేళ నీకమ్మాయి పుట్టినా, అబ్బాయి పుట్టినా మాతో వియ్యమొందాలిసుమా ! దాని కొప్పుకుంటేనేగాని నేను చెప్పను" అంటూ చెప్ప దల్చుకున్న విషయాన్ని దాచి దాచి బయటపెట్ట కుండా వుంటుంటే-

"అబ్బ ! వూరికేనానపెట్టకు-చల్లకొచ్చి ముంత దాచుకొన్నట్లు యెందుకు దాస్తావ్" అన్నాడు రజని.

"ముందు వొప్పుకోండి" - అంది భువనేశ్వరి.

"వోసి నీ యిల్లు బంగారంగానూ, అసలు విషయంయేమిటో తెలియదు. వొప్పుకోమంటే యేమని వొప్పుకోం" - అన్నాడు రజనీకాంతుడు.

భువనేశ్వరి చెప్పడానికి నిశ్చయించుకొంది.

"మీ యిద్దరి పెళ్ళికి అమ్మ - నాన్న వొప్పు కున్నారు ... రేపటినుంచీ పెళ్ళి ప్రయత్నాలు చేస్తానన్నాడు నాన్న. వీలుగావుంటే యీ నెల లోనే చేస్తాట్ట" అంటూ యేదో చెప్పుకొని పోతుంటే, తరువాత మాటలు రజనీకాంతుడుగాని, రాగవర్ధని గాని వినడం మానేసి, ఒకళ్ళ మొగాలొకళ్లు చూసు కొని నవ్వుకొంటూండగా, పెళ్ళికూతురికి స్వభావ సిద్ధంగా వచ్చేసిగ్గు రాగవర్ధనికి, పెళ్లికుమారునికి వుండ వలసిన హుందాతనం రజనీకాంతుడికివచ్చి, పెద్దలు నిర్ణయించిన శుభలగ్నాన, కల్యాణవేదికమీద యిద్దరూ తలంబ్రాలు పోసుకొంటూండగా-"సీతమ్మ పెళ్లికూతురాయెనే" అనే సన్నాయి పాటలో శకుంతలమ్మ సంతోషం, సువర్చల - క్రాంతీనాథ్‌ల ఆనందం, భువనేశ్వరి ఆనంద్‌మోహన్‌ల అనురాగం వరుని తల్లిదండ్రుల వాత్సల్యం నిబిడీకరించుకొని పోయింది.

కాని గేటువద్ద రాగవర్ధని కన్నతల్లి పార్వతమ్మ కార్చే ఆనంద బాష్పాలు, హృదయంలోంచి పెల్లు బికే మాతృత్వం నిబిడీకరించుకొని వుందో లేదో అనూహ్యం. కాని అది నగ్నసత్యం. దాగని - మాగని యుగధర్మం. కన్నబిడ్డ ఆనందం కన్నకడుపు అనుభవించినట్లు యితరంగా, యేదీ అనుభవించలేదు. యిది సృష్టిలోదాగిన మహత్తర విషయం. తెలు సుగోకల్గినవారే తెలివిగలవారు. అనుభవించినవారే ఆనంద స్వరూపులు.

# సిరిసిరిమువ్వలు

"అదేమిటండీ! — వర్షం కురుస్తుంటే గొడుగు ముడిచేసి తడుస్తూ వెళుతున్నారు"

"క్రొత్తగొడుగు-యిప్పుడే షాపులో కొనుక్కొస్తున్నాను; వర్షానికి తడుస్తుందేమోనని..."

రాజేంద్ర

♦ ♦ ♦

"అమ్మగారూ! మీపాత రవిక యిచ్చారు కాదూ!"

"పిచ్చిదానా! నారవికలు నీకెలా పనికొస్తవే - వదులు కావూ!"

"నాకివ్వాలని మీకుంటే మీరవికలకు సరిపోయేటట్లు నన్ను సాకగూడదూ!"

♦ ♦ ♦

"ఏమండీ! అంత దీర్ఘముగా చదువుతున్నారు - ఏమిటాపుస్తకం!"

"వైవాహిక జీవితపు సౌఖ్యములు"

"అయితే అందులో భర్తలకు చెప్పిన నీతిని చదివారా!"

"లేదు - భార్యలకు చెప్పిన నీతిని చదువుతున్నాను"

ఆర్. యస్. లక్ష్మి

♦ ♦ ♦

"ఏంరా సత్యం! పరీక్షలు బాగా వ్రాశావా"

"ఓ........"

"అయితే యీసారి పరీక్ష గట్టెక్కినట్లే నన్నమాట"

"అదే ఆలోచిస్తున్నాను నాన్నా!"

'నారపీచు'

♦ ♦ ♦

"అబ్బ!బ్బ! మీతో యిక కాపురముచేయలేనండీ - ఏనుయ్యో, చెరువో చూచుకోవాలి"

"అయితే! - మరచాను - నీకు యీతరాదు జ్ఞాపకముందా."

"నిజమేనండోయ్ మీరు చెప్పింది!...."

పిల్లాసుబ్బారావు

# బాలనాగమ్మ కథ

(క్రీ. శ. 1340 ప్రాంతం)

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

---

మహమ్మద్ బిన్ తోగ్లక్ పరిపాలన పిచ్చిపరిపాలన. కాబట్టి ప్రజలు, పరిపాలకులు పడని కష్టాలు లేవు. కాబట్టి వారు స్వాతంత్ర్యం సాధించదలుచుకొన్నారు.

కోస్తా జిల్లాలలో అనగా గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో ప్రోలయనాయకుడు అనే మహా వీరుడు బయలుదేరేడు. 1326 లో కోస్తా జిల్లాలకు స్వాతంత్ర్యం సంపాదించి పెట్టేడు. పశ్చిమ దక్కన్‌లోని కంపిలి రాజ్యాన్ని మహమ్మదీయ ప్రతినిధియైన మాలికినెబి అను నతడు పాలిస్తున్నాడు. అతనితో ఆరవీటిరాజైన సోమదేవరాజు స్వాతంత్ర్య యుద్ధం చేసేడు. అందుచేత దేశం లొంగడంలేదని మాలికినెబి, తోగ్లక్ సుల్తానుకు చెప్పగా, అతను తన వద్దనున్న హరిహరుణ్ణి కంపిలి ప్రాంతానికి పరిపాలకుడిగా ఏర్పాటు చేసేడు. కాని అతను సుల్తానుని ఎదిరించి స్వేచ్ఛగా పరిపాలించేడు. కర్ణాటక దేశంలో భల్లాలరాజులు తిరగబడ్డారు. మలబారులో మహమ్మదీయ ప్రతినిధియైన అహ్‌సన్‌షాహ్ స్వతంత్రుడయ్యేడు. ఇట్లు అనేకమంది తిరగబడ్డారు.

తుగ్లక్, తిరుగుబాటుదారులను శిక్షించడానికి క్రీ. శ. 1334 35-లో బయలుదేరేడు. దక్కన్ దేశాన్ని దౌలతాబాద్‌నుండి పరిపాలించడం కష్టమని దానిని రెండు భాగాలుగాచేసి పశ్చిమభాగానికి బీదరును, తూర్పు భాగానికి వరంగలును రాజధానులుగాచేసేడు. అయినా ఇవి దౌలతాబాదుకి లొంగిఉండవలసిందే! వరంగలులో మాలిక్ కాబుల్ అను వానిని ప్రతినిధిగా నిర్ణయించేడు. ప్రోలయనాయకుని బంధువైన కాపయనాయకుడు క్రీ. శ. 1336-37 * ప్రాంతాలలో కాబోలు వరంగలును జయించేడు. అంతటితో తెలంగాణం స్వాతంత్ర్యం పొందింది. 1336-లో విజయనగర రాజ్యానికి శంకుస్థాపనజరిగింది. పశ్చిమ దక్కన్‌లో అమరాన్-ఇ-సదాహి అనువాడు తిరగబడ్డాడు. ఈ తిరుగబాటులను తుగ్లక్ సుల్తాను అణచుదామని వచ్చేడు. కాని గుజరాతులో తిరగబాటు జరగగా అక్కడకు వెళ్ళేడు. అప్పుడు పశ్చిమ దక్కన్‌లో అల్లా ఉద్దీన్ హసన్ అను నతడు బహమనీ రాజ్యాన్ని క్రీ. శ. 1347-లో స్థాపించేడు.

కాపయనాయకుడు తెలంగాణానికి స్వేచ్ఛను సంపాదించిపెట్టేడు. కాని అతనికి ఇద్దరు శత్రువులు ఏర్పడ్డారు. వారిలో పైన జెప్పిన అల్లా ఉద్దీన్ హసన్ ఒకడు. ఇతను క్రీ. శ. 1347-51 మధ్యకాలమందొకమారు వరంగలుపై దండెత్తేడు. అట్లే 1356-లో మరొకసారి దండెత్తేడు. కాపయనాయకుడి కుమారుడైన వినాయకనాయకుణ్ణి చంపివేసేడు. కాపయనాయకుడికి మతిపోయి, ఢిల్లీ సుల్తాను అయిన మాలిక్ ఫిరోజ్ షాహ్ బార్‌బన్‌క్ అనునాతని సహాయంకోరేడు. కాని అతను తన శక్తికి మించినపని అని జోక్యం కలిగించుకోలేదు. దీనివల్ల మరొక పిడుగువచ్చిపడింది. బహమనీ సుల్తాన్ వరంగల్‌పై దండెత్తేడు. క్రీ శ. 1364-65-లో

---

* A forgotten chapter of Andhra History P 69.

సంధిజరిగింది. కాని రేచర్ల నాయకుల శత్రుత్వం క్రమక్రమంగా వృద్ధిపొందింది. బలహీనుడైన కాపయ నాయకుడిమీద అనవోత నాయకుడు క్రీ. శ. 1367-68 ప్రాంతాలలో విరుచుకుపడ్డాడు. కాపయ నాయకుడు వీరస్వర్గం చేరుకున్నాడు. తెలంగాణం రేచర్ల నాయకుల చేతికిందికి వచ్చింది.

జంగం కథను వ్యంగ్యంగా రచించినందువల్ల కవి అసలు పేర్లనుమార్చి చెప్పవలసివచ్చింది. ఓరుగంటికి సుల్తాన్‌పూరు అని తుగ్లక్ నామకరణం చేసేడు. దానికి కవి భూచక్రపట్టణం అని పేరు కల్పించేడు; దానిని నవభోజరాజు పరిపాలిస్తున్నాడు అన్నాడు కవి. ఈ నవభోజరాజు ♦ ఎవరు? ఇతను ఎవరు కాకతివీర ప్రతాప రుద్రుడా?

కాకతివీరప్రతాపరుద్రుడు తుగ్లక్ చేత క్రీ. శ. 1323-లో ఓడించబడి బందీగా చేయబడ్డాడు. అతన్ని ఢిల్లీకి తీసుకుపోతూండగా నర్మదా నదీ తీరాన్ని మరణించేడని కలువచేరు శాసనం † నుంచీ దారిలో చని పోయేడని షామ్స్ ఇసిరాజ్ అను మహమ్మదీయ రచయిత ‡ వల్ల తెలుస్తూంది. తెలంగాణం దౌలతాబాద్ నుంచి పరిపాలించబడింది. వరంగలు ప్రాంతాన్ని గురించి ఏమీ తెలియరావడంలేదు. కాని వరంగలులో స్థానికపరిపాలకుడులేడని మనం భావించరాదు.

వీరప్రతాపరుద్రుడు మరణించేడు. కాబట్టి జంగం కథలోని నవభోజరాజు అతను అవడానికి వీలులేదు. కాని ఆ బిరుదు అతనికి సంబంధించినదే! వీర ప్రతాపరుద్రుడు అనేకమంది కవులను పోషించడం చేత ఆ బిరుదుకి తగిఉన్నాడు. అతని తర్వాత వరంగలులో స్థానికపాలకుడిగా ఏర్పరచబడ్డవాడికే కవి నవభోజరాజు అను పేరును వాడేడని చెప్ప వచ్చు. అయితే ఈ నవభోజరాజు కాపయనాయకుడా అను అంశాన్ని పరిశీలించవలస్తుంది.

వీరప్రతాపరుద్రుడు మరణించిన పిమ్మట కొంత కాలానికి తుగ్లక్ సుల్తాను వరంగలులో మహమ్మదీయ పరిపాలకుడిగా మాలిక్ కాబూల్ అను నతణ్ణి ఏర్పరిచేడు. అటు తర్వాత 1336-37 ప్రాంతాలలో కాపోలం కాపయనాయకుడు ఓరుగంటిని గెల్చుకొని స్వతంత్రంగా పరిపాలించేడు. కాని జంగంకథలో చెప్పబడ్డ నవభోజరాజు స్వతంత్రుడు కాడు. అతను ఢిల్లీకి కప్పంకట్టేవాడు. కాబట్టి నవభోజరాజు కాపయనాయకుడు కాడు. కాపయ నాయకుడి కాలంనుంచి తెలంగాణం ఏదో విధంగా స్వతంత్రంగానే ఉంటూవచ్చింది. కాబట్టి ఈ జంగంకథ కాపయనాయకుడికి పూర్వము, వరంగలు పరిపాలకుడిగా మాలిక్ కాబూల్ ఏర్పడక పూర్వము జరిగిఉండాలి. 1323 లో ఉలుగ్ ఖాన్ వరంగల్ ప్రాంతాన్ని జయించేడుకదా! అతను జయించిన కోటలన్నిటిలోను మహమ్మదీయ పరిపాలకులను పెట్టేడని భావించరాదు. వీరప్రతాపరుద్రుని హిందూ ఉద్యోగులను ఢిల్లీకి కప్పంకట్టనియమించి స్థానిక

♦ నవభోజరాజు పేర్లు చాల ఉన్నాయి. 18 వ శతాబ్ది చివరిభాగంలో గద్వాల సంస్థానాన్ని ఏలిన ప్రభువు సోమభూపాలుడు. ఇతను ముష్టిపల్లి తిరుమలరాయని పుత్రుడు. గద్వాల ప్రభువగు రామరాయలు ఇతన్ని దత్త పుత్రుడిగా గ్రహించేడు. సోమభూపాలుడికి నవభోజరాజు అను బిరుదుఉంది. కృష్ణదేవ రాయల ఆస్థానంలో ఉండినట్లే ఇతని ఆస్థానంలోకూడ అష్టదిగ్గజాలుండేవారు. సోమభూపాలుడు రతి రహస్యము, అష్టపది అను గ్రంథాలను రచించేడు.

[చూ. ఆంధ్రపత్రిక 1.10.53.లో బులుసు వెంకటరమణయ్యగారు రచించిన కవులు - కవిపోషకులు అనువ్యాసం.]

† A forgotten chapter of Andhra History P. 14.

‡ Do Do

పాలకులుగా నుంచి, వెనకటి హిందూ మంత్రులను కొందరిని మంత్రివర్గంలోకి తీసుకొనీ, మధ్యమార్గ మవలంబించి హిందువులను లొంగతీయడానికి * ఉలుగ్ ఖాన్ ప్రయత్నించేడు.

కాబట్టి 1323-లో ఉలుగ్ ఖాన్ వరంగలును గెల్చుకొని ఒక హిందూపరిపాలకుణ్ణి ఏర్పరిచి ఉండాలి. అతనికే జంగంకథాకవి నవభోజరాజు అను పేరుపెట్టి ఉండాలి. భావిపరిశోధనవల్లగాని ఈ చరిత్రాంశాలు బైటపడవు.

భోజరాజు అను పేరు కాకతీయుల కాలంలో వాడుకలో లేకపోలేదు. కాకతీయగణపతిదేవుడు తన సేనానాయకుడైన సామంత భోజుణ్ణి సైన్యంతో కూడ క్రీ. శ. 1249-లో దక్షిణ దిగ్విజయ యాత్రకి పంపేడు. భోజుడు కంచిని జయించి కాకతీయ రాజ్యాన్ని విస్తరింపచేసేడు. †

జంగంకథలోని నవభోజరాజు ఢిల్లీకి కప్పంకట్ట లేకపోయేడు. అందుమీదట ఢిల్లీ సుల్తాన్ అతన్ని పనినుంచి తొలగించి, కోటను ఏలంవేసేడు. ఇట్టి దుష్టపరిస్థితులే ఆ కాలంలో ఉండేవని చరిత్రనుంచి తెలుస్తూంది. కాబట్టి ఢిల్లీ సుల్తాన్‌మీద ప్రజలు, నాయకులు తిరగబడ్డారని చెప్పవచ్చు. ఢిల్లీ సుల్తాన్ విషయమట్లుండగా స్థానికులైన మహామ్మదీయులు చేస్తూండిన దుండగాలను ఈ జంగంకథ విశదపరుస్తూంది. నాగళ్ళపూడిలో నివసిస్తూన్న ఫకీరొకడు బాలనాగమ్మను ఎత్తుకుపోయేడు. వాడిని చివరకు బాలవర్ధిరాజుచంపి ఆమెను రక్షించేడు. ఈ అంశమే ఈ గేయంలో వివరింపబడింది. బాలనాగమ్మకథ 1323-కీ 1333-కీ మధ్య జరిగిందని చెప్పవచ్చు. ఈ పాట రచనకూడ సమీపకాలంలోనె జరిగిఉండాలి. కాబట్టి దీని రచనాకాలం క్రీ. శ. 1340 ప్రాంతమని చెప్పవచ్చు.

### ఆధునికీకరణం

ఈ గేయాలలోని భాషలో ఒక్కొక్కప్పుడు వెనకటిమాటల బదులు కొత్తమాటలు కనబడుతూంటాయి. ఇట్టి సందర్భాలలో చేరినవే ట్రూపు, రసీదు అను పదాలు అని పూర్వమే తెలియజేసేను. అల్లే దీనిలో ఢిల్లీపాదుషా అను మాట కనబడుతూంది. పాదుషా అనుమాట క్రీ. శ. 1500 ప్రాంతంలో ఢిల్లీపాలకుల బిరుదు. ఢిల్లీ సుల్తాన్ అనుపదం ఆధునికం (Modernize) చేయబడి ఢిల్లీ పాదుషా అయింది. కాబట్టి అది గేయకాల నిర్ణయానికి తోడ్పడదు.

### ఇది ఎట్టి కావ్యం ?

ఇది దుఃఖాంత కావ్యమా, లేక సుఖాంత కావ్యమా అనేది ఒక ప్రశ్న. కథ ప్రారంభించిన దగ్గరనుంచి సుమారుగా చివరిదాక కష్టాలతో నిండి ఉంటుంది. కాని చిట్టచివరకు యుద్ధంలో చచ్చిన రాజులు, సైన్యం బ్రతుకుతారు. ఈ విధంగా కవి దీనిని సుఖాంతంచేసేడు. ఇది ఒక సంప్రదాయంగా వెలిసింది. కాబట్టి ఇట్టిమార్పు చేయబడింది. సంస్కృత కావ్యాలు సుఖాంతంగా ఉండాలను సంప్రదాయం వంటిదే ఇదికూడ. ఇదొక కృతక పద్ధతి. సంప్రదాయంగా ఏర్పడడంచేత జంగంకథాకవులు దీనిని విసర్జించక అనుసరించేవారు. శ్రోతలు కూడ దానిలో కవిత్వన్యాయం (poetic justice) ఉన్నట్లు తృప్తిపడేవారు. కాని ఇది నిజానికి దూరమన్న సంగతి మాత్రం మనం మరువరాదు. ఏదయినా, ఇది సుఖాంత కావ్యమే !

### సాంఘిక స్థితి

కథాకాలంనాటి సాంఘికస్థితి దీనిలో విరివిగా వర్ణించబడింది.

* Early Muslim Expansion in South India by Dr. N. Venkataramanaiah P. 121

† The early Muslim Expansion in South India by Dr. N. Venkataramanaiah P. 6.

రాజుగారి కోట గవనులవద్ద క్రూరజంతువులుకూడ కావలిగా ఉంచబడతాయి. ఊరికి తిరిగివచ్చిన రాణిని రాజు ఉత్సవంతో ఎదుర్కొంటాడు. రాజులు వేటకి వెళతారు. లేఖలను డేగలకు కట్టి పంపుతారు.

రాచస్త్రీలకు గోషా ఉంది. మంత్రసానులున్నారు. గర్భవతికి మంత్రసాని మంత్రించిన జలమిస్తుంది. కాబట్టే ఆమెకు ఆ పేరువచ్చిందని చెప్పవచ్చు. కూతురు జన్మించగా రాజు ఊరంతటా భూరి (పుత్రికోత్సవం) పంచిపెట్టిస్తాడు. దానివర్ణన—

పన్నెండుపుట్ల ఖండచక్కెరేమి
ఎనిమిదిపుట్ల పంచదారయపుడు
ఆరువందల ఆకుమోదలేమి
ఏడుం పోకవక్కలయిన
పట్నమంతయు భూరిపంచినాడు

తన బిడ్డను తాను తేరపారిచూస్తే పిల్లకి దృష్టి తగులుతుందని తల్లి ప్రాణం అనుమానిస్తుంది. పిల్లలకు నామకరణ మహోత్సవంచేస్తారు. చిన్న పిల్ల
లకు నామకరణ మహోత్సవంచేస్తారు. చిన్న పిల్ల
ల చేతులు జ్యోతిష్కులకు చూపించేటప్పుడు పరదా అవతల ఉండాలి! బిడ్డలు అచ్చనగిల్లలు, నువ్వి పాటలు, బొంగరాలు ఆడడం నేర్చుకొంటారు. వారికి చిన్నప్పటినుంచి నగలంటె ఎంతో ముచ్చట! పసి ఆడపిల్లలు గుత్తపు రవికెలను తొడుగుకొంటారు. ఈ అలవాటు ఇప్పటికీకూడ పశ్చిమాంధ్రంలో ఉంది. మారుటి తల్లికి సవతితల్లి పిల్లలంటే ఎంతమాత్రమూ సరిపడదు. మందులు పెడితే మరులు కలుగుతాయని నమ్మకం. రాజుకి చిన్నభార్యమాటే పథ్యమవుతుంది.

పెళ్ళికూతురికి పెళ్ళికొడుకు పెళ్ళిలో కొన్ని అభరణాలిస్తాడు. రాజుల మహలులలో గాజులసెట్టి గాజులువేయగా అతనికి సర్వాభరణము, పూలహారాలు, నూటపదహారులు, జోడు శాలువలు (పుట 113) లభిస్తాయి. మాణిక్యాలదేవి మరణిస్తూ తులసితీర్థం పుచ్చుకొంది.

హింసకులు పద్దెనిమిది జాతులవారనిలెక్క. పేదరాసి పెద్దమ్మది పూటకూళ్ళవృత్తే! పరవాకి భోజనం లభిస్తుంది. ఆమె ఇంటిలోనె విశ్రమించవచ్చు.

రాజు నేరస్థులను ఎట్లు శిక్షిస్తాడో చూడండి. నేరస్థుణ్ణి చెట్టుకి వ్రేలాడగట్టి చింతబరికెలతో బాదుతారు. ఒళ్లు కాలుస్తారు. ఒంటికి సున్నం పట్టిస్తారు.

ఆకాలంలో వృత్తిపనులు మంచి స్థితిలో ఉన్నాయి. పిల్లలు జరీబొందులు తొడుగుకొంటారు. పట్టుసెల్లాలు, అడ్డతెరలు ఉన్నాయి. కంసాలి బత్తుడు నగలను తయారుచేస్తారు. నాగబంధపు చీరలున్నాయి (పుట 45).

దుశ్శకునాలలో నమ్మకం విశేషంగా ఉంది. రాజుకి కీడు కాపరించేముందు పట్టపుటేనుగు చస్తుంది. ఇంటి మొగదూలం విరిగిపడుతుంది. గిన్నెలదొంతి తిరగబడుతుంది. పాలకుండ పగులుతుంది. దొడ్డిలో ఆవులు చస్తాయి.

ఈ కథలో ఆనాటి సాంఘికస్థితి వివరిగా చెప్పబడింది. ఈ కవి రెండు మాటలలో చెప్పే మూభావం మనిషి కాదు.

## కథ తీరు

బాలనాగమ్మకథ (క్రీ. శ. 1340 ప్రాంతం) చారిత్రకం. కాని దీనిలో ఊహాకల్పనలు జాస్తి అయ్యాయి. పైగా జంగంకథలలో కొన్ని సంప్రదాయాలు అనుసరించబడతాయి. ఇందువల్ల ఇది అర్థ గంధర్వకథ (Semi-Fairy Tale) లాగు కనబడుతుంది. అయినప్పటికీ ఇది పూర్తిగా ఉపజ్ఞా (Original) రచన. ఆకాలం నాటికి (క్రీ. శ. 1340) ఆంధ్ర గ్రాంధిక వాఙ్మయం అనువాదాలలోను, అనుకరణలలోను మునిగి తేలుతూంది. అటువంటి సందర్భంలో ప్రజావాఙ్మయమైన జంగంకథలు పూర్తిగా స్వతంత్రంగా, ఉపజ్ఞతో వర్ధిల్లేయి. జంగంకథలలో బాలనాగమ్మకథ సాటిలేనిది.




సీరియల్ కథ

# విజయలక్ష్మి

శ్రీ పిళ్ళా సుబ్బారావుశాస్త్రి

అగ్నిసింహుడంటే నిజంగా అగ్గిలాంటి వాడు. ఆ రోజుల్లో రాజులు, చక్రవర్తులు, ప్రజలు, వీరులు అంతా అగ్నిసింహుడి పేరు చెబితే గడగడలాడేవారు, గజగజవణికేవారు. అగ్నిసింహుడు ఒఠి మూర్ఖుడు, క్రూరుడు, కుటిల స్వభావం గలవాడు. అగ్నిసింహుడిలో కంచు కాగడా పెట్టివెతికినా, దయ, నీతి, న్యాయం, ధర్మం అన్నవి మచ్చుకయినా కనిపించవు.

అగ్నిసింహుడు సింహకోట రాజు. ధైర్యం, సాహసం, భుజబలం, కండపుష్టి గలవాడు. అగ్నిసింహుడికి ఎంత డబ్బు వున్నా, ఎంతరాజ్యమున్నా తృప్తి అన్నది లేనేలేదు; ధనకాంక్ష, రాజ్యకాంక్ష తప్పితే!

అగ్ని సింహుడు ఎంతసేపూ సైన్యంతో యితర రాజ్యాల మీదపడి, ఆ రాజ్యాలని నాశనంజేసి ధనం కొల్లగొట్టుకుపోయేవాడు!

సాగర సామ్రాజ్య ప్రజలు పిడికిట్లో ప్రాణాలు పెట్టుకుని కొండలంట,గుహలంట అడవులంట పారిపోతున్నారు.-అవునుమరి-సాగర సామ్రాజ్యంమీద నరరూపరాక్షసుడు, అగ్నిసింహుడుయుద్ధం ప్రకటించాడు. గెలుస్తామని ఎవరికీ నమ్మకంలేదు! ఎలా వుంటుంది? సాగర సామ్రాజ్య అధిపతి విజయవర్మకే నమ్మకంలేదు...!

అగ్నిసింహుడు ఎటువంటిరాజ్యాన్నయినా సరే, ఎంత సైన్యంవున్నా సరే ఒక్క మాటు కబళించి వేస్తాడు. జయాపజయాలు తర్వాత చూసుకోవచ్చు. ముందు ప్రాణాలు రక్షించుకుంటే చాలు అని సైనికులు సహితం మాయమవసాగారు.

“ప్రభూ! ‘అగ్నిసింహుడ’నే సరికి ప్రతీవారికి భయమే...! సైనికులంతా యేమయ్యారో ఒక్కరుకూడా లేకుండా రాత్రికి రాత్రి మాయమయ్యారు. ముందు మనవంశం నిలబడేట్టు చూడాలి!” అన్నాడు మంత్రి.

“మంత్రీ!... చిక్కులన్నీ ఒక్కసారే వచ్చి పడ్డాయి...! రాణి చచ్చిపోయి

మూడుమూసాలయినా పూర్తికాలేదు ! ఆ పసిపిల్లగతేంగావాలో..."

"ప్రభూ...! విచారిస్తే లాభంలేదు. ఇప్పుడు మనం మనకర్తవ్యం గురించి ఆలోచించాలి....! మనం ముసలివాళ్లం. మనం పోయినా బెంగలేదు. కాని మన వంశ గౌరవం నిలబడేది యెట్లా?"

"అదే ఆలోచిస్తున్నాను...., మనవంశం నిలబడాల్నంటే ఏణ్ణర్ధంవాడు ఆ పసిపిల్లాడే ముఖ్యం. ఆడపిల్లవల్ల వంశం వృద్ధిగాదు. నువ్వు ఆ యువరాజుని తీసుకొని పారిపోయి, జాగ్రతగా పెంచి పెద్దవాణ్ని చేసి ఒకరాజుని చెయ్యి....!" అంటూ విజయవర్మ సంవత్సరన్నరకొడుకు సాగర సింహుని ఒప్పజెప్పాడు మంత్రికి.

'చిత్తం ... మీరుగూడా యెలాగయినా అమ్మాయితో తప్పించుకోండి....' అంటూ మంత్రి మారువేషంతో కుర్రాణ్ని తీసుకుని ఎక్కడికో పారిపోయాడు.

రాజ్యమంతా అల్లకల్లోలంగావుంది. అగ్నిసింహుడప్పుడే రాజ్యంలో ప్రవేశించేశాడు! అప్పుడే అగ్నిసింహుడి రథచక్రాలక్రింద ఎందరో పసిపిల్లలు, స్త్రీలు, పురుషులు, ముసలివాళ్లు, నోరులేని జంతువులు పడి నలిగిపోతున్నారు! సముద్రం ఘోషించినట్టు రాజ్యమంతాఘోషిస్తోంది. రథచక్రాలక్రింద పడుతున్న వాళ్ల ఎముకలు పటపటమంటున్నాయి ,రక్తంకాల్వలుగడుతోంది....!

త్రేతాగ్నిలా కళ్లూ, నల్లటిశరీరం, బొద్దుమీసాలు తళతళ మెరిసే చేతిలో కత్తి, భయకంపితుల్ని చేస్తూ అగ్నిసింహుడు విరగబడి నవ్వుతూ, వినోదాన్ని నృత్యాన్ని, నాటకాలని చూస్తున్నట్టుగా చూస్తూ రథాని కెవరయినా పొరపాటున అడ్డుపడితే, తన కత్తితో వాళ్లతలలు ఛర్ర్...మనిపిస్తున్నాడు.

"ఆగు ....! అహ్హహ్హ ....! ... పిరికిపందా! ఎక్కడికి ప్రయాణం...? అగ్నిసింహుడికే "టోపీ" వెయ్యాలనుకున్నావ్? ... అది భగవంతుడికికూడా చేతగాదు.. ?.. ఏమిటది ? ఖజానాలో డబ్బుగాదూ...!" ఆ భవనందద్దరిల్లింది!! ఆకాశంపడిపోతున్నట్లుగా, భూమికూలిపోతున్నట్లుగా అనిపించింది!! ఆ మేడ మేడంతా ఒక్కసారి కదిలి, గోడలన్నీ బీటలు పడినై!!!

విజయవర్మ గజగజ వణికిపోయాడు! నోటంట మాటరాలేదు! చెమటలు పోసేసినై !

"ప్ర.. భూ...! క్ష...మించండి...! ఇది ... ధ...న.. మే!" అతికష్టంమీద అనగలిగేడు.

"ఎందుకు తీసుకువెడుతున్నావ్.. ?"

"క్షమించండి...! మీకు పనికిరాదు కాబట్టి..."

"ఆఁ ... హాఁ! నాకు పనికిరానిది డబ్బెలా అవుతుంది...? చూపించు...!"

"చూడండి...!"-విజయవర్మ ముసుగు తీశాడు. హాయిగా, ఆనందంగా నిద్ర పోతోంది పసిపిల్ల.

"పిల్లా ...! ఇహ్హ ... హీహ్హాఁ...! ఫో ... ఫో!" - ఎడంచేత్తో 'ఫెళ్' మని కొట్టేడు అగ్నిసింహుడు.

విజయవర్మ ఏమీఅనలేదు! ఎందు కనలేదు? విజయవర్మకి బలంలేదా? ధైర్యంలేదా? రాజపుత్రుడుకాడా!???? అగ్నిసింహుణ్ణిచూసి భయపడ్డాడా? పిరికి పందా?-అనుకుందికి వీల్లేదు. విజయవర్మ ధైర్యపరాక్రమాలుగలవాడు! కాని ప్రజల నాశనం, అతనికి యిష్టంలేదు! రెండోది కడుపుతీపి! ... కన్నకూతురు! పసిపిల్ల...! మూడుమాసాల పసిగుడ్డు...!

"ఆఘూ..." త్రుళ్లిపడ్డాడు విజయ వర్మ. వెళ్ళిపోతున్న విజయవర్మ తిరిగి వచ్చేడు.

"మంత్రీ! జోస్యుడేమన్నాడూ?" అంటూ మంత్రిని ప్రశ్నించాడు అగ్ని సింహుడు.

"అదే, ప్రభూ! మీరు ఒక అమ్మాయి వల్ల మరణిస్తారని..."

"సైన్యాధిపతీ!"

"చిత్తం...!"

"జోస్యం నిజమవుతుందా?"

"అవుతుంది, ప్రభూ...!"

"ఆఁ...హాఁ ...! ఎవరికయినా జరిగిందా?"

"ప్ర...భూ! ఎవరికోకాదు, నాకే జరిగింది!"

"ఏం, జరిగింది?"

"ఒక జోస్యుడు నాకు ముగ్గురు పెళ్ళా లని, మొదటి యిద్దరూ పెళ్లయిన రెండు నెలలకే చస్తారని, మూడో భార్య జీవి తాంతంవరకూ వుంటుందని, కాని పిల్లలు కలుగరని, నాకు సంతానప్రాప్తిలేదని చెప్పాడు...! నిజంగానే యిద్దరు భార్యలు పోయారు! మూడో భార్య వుందండి. సంతానంకూడాలేదు!"

"ఆఁ ... అలాగా! మరి నువ్వె కాలం బ్రతుకుతావని చెప్పాడు?"

"ఇంకా ... పద్దెనిమిదేళ్లు బ్రతుకుతా నండి" అంటూ చెప్పాడు సైన్యాధిపతి.

"అయితే, మన జోస్యుడి ప్రకారం నన్ను యీ అమ్మాయే పెరిగి పెద్దదై చంపవచ్చు...! కాబట్టి వీళ్ళిద్దర్నీ తీసుకు పోయి ఊరవతల చిత్రవధచేయండి" అంటూ ఆజ్ఞాపించాడు అగ్నిసింహుడు.

విజయవర్మ పాపం, కాళ్ళావేళ్ళాపడి ఎంతగానో బ్రతిమలాడుతున్నాడు. కాని లాభంలేకపోయింది. భటులు విజయ వర్మని బంధించేశారు!

విజయవర్మని పసిపిల్లని ఊరవతలకి తీసుకువెళ్ళారు భటులు. విజయవర్మ విడి పించుకునేందుకుగాను ఎంతో ప్రయత్నిం చాడు. కాని లాభం శూన్యం.

రాజ భటులు విజయవర్మని చెట్టుకుకట్టి పిల్లని క్రిందపడేశారు. పిల్ల ఏడుస్తున్నా ఆ కఠిన పాషాణ హృదయులకి దయ అన్నది కలుగలేదు!

విజయవర్మ అరుపులకి ఆ అడవి ప్రతి ధ్వనిస్తోంది! అతని రెండు చేతుల్ని ముక్కలు ముక్కలుగా ఖండించారు భటులు...!

విజయవర్మ మెడకు తాడువేశారు.

దీంతో విజయవర్మ మరణించినట్టే! విజయవర్మ గట్టిగా అరుస్తున్నాడు. ఉరి తాడు పీకెను నులిమేస్తోంది! తాడులాగు తున్న సేవకుడు 'అమ్మా' అంటూ పెద్ద కేకవేసి నేలకూలాడు...! - దూరంనుంచి అరుపులు వినిపిస్తున్నాయి! వాళ్లంతా కొండవాళ్ళలావున్నారు.

విజయవర్మని, ఒక సేవకుడు కత్తిదూసి గుండెల్లో పొడిచేశాడు! - అదే సమ యంలో పదిబాణాలువచ్చి అక్కడున్న సేవకులను నేలకూల్చాయి!

(1128 పేజీ తరువాయి)

అప్పుడే ఎనిమిదిన్నర, తొమ్మిది అవస్తోందికూడాను.” తిరిగి చదువులోపడిపోయాడు శంకరం.

మీటింగు లేకపోతే బాబు ఎక్కడికి వెళ్ళినట్టు?... కొంపతీసి, ఏజ్వరమో, తలకాయనొప్పోవచ్చి, రాలేక తోవలోపడిపోలేదుకదా? ... అబ్బే! అలా జరిగుండదు. ప్రొద్దుటే హుషారుగా, బాగానే వెళ్ళేడు స్కూలుకు. సాయంత్రం శంకరంకూడ చూశాడుటగా, ఏమైన మనిషిమారినట్లయితే నాతో శంకరం చెప్పడూ?

ఒకవేళ ఏసినీమాకైనా వెళ్లేడేమో! ... ఛీ. ఛీ. అటువంటి పాడుసినీమాలకు ఎప్పుడు వెళ్ళడు నా బాబు. వెళ్లినా వీడికి డబ్బులు ఎక్కడివి? దొంగ తనంగా ఎత్తుకుపోయాడేమో! ... అయితే ఇటు వంటి దొంగబుద్ధులుకూడ పుడుతున్నాయన్నమాట. ఇంటికివచ్చిన తరువాత నాలుగు చివాట్లు పెట్టి, గట్టిగా బుద్ధివచ్చేటట్టుగా తన్నితేనేకాని ఓ దారి లోకిరాడు. జానికమ్మగారికి కోపం ఎక్కువైంది. అంతకోపం ఆవిడకు ఇంతకుముందెప్పుడూరాలేదు. ఆ సమయంలో బాబు కండ్లకు కనపడినట్లయితే, వళ్లు తెలియని ఆవేశంలో ఏమైనా చేసేస్తుంది.

గబగబా లోపలకువెళ్లి డబ్బులపెట్టె తీసి చూసింది. తను అందులోవేసినడబ్బు, తీసినడబ్బు, అన్నీ లెక్కచూసుకుంటే, సరిగ్గా సరిపోయింది. అయితే వీడు ఇంట్లో డబ్బులు పెట్టి, సినీమాకు పోలే దన్నమాట ... మరి వీడు ఎక్కడికి వెళ్లినట్లు?

ఇంకా ఏవేవో అనుమానాలతో, ఆవిడ మనస్సు ఎంతో బాధపడింది. నిక్షేపంలాంటి కుఱ్ఱాడు, పాడుస్నేహాలుచేసి చెడుపోతూవుంటే, ఆమె సహించి చూస్తూ వూరుకోగలదా? తన వంశానికి శాశ్వత పేరు, ప్రతిష్ఠలు తెస్తాడని, తను ఆశించిన ఆశంతా నిరాశకావలసినదేనా? బాబు భవిష్యత్ అంతా భస్మంకావలసినదేనా? ఇటువంటి చిన్న చిన్న విష యాల దగ్గరనుంచి తగిన శ్రద్ధ తీసుకోపోతే, బాబు జీవితం తప్పకుండా వక్రమమైన మార్గంలో పడితీరు తుంది. అప్పుడు తను ఆశించిన ఫలితం ఫలప్రదం కాదేమో! ... బాబును గురించి తలపోస్తూ, బాబు చదువుకునే చాపమీదే నిద్రపోయింది జానికమ్మ గారు. ...

బాబు స్కూల్లో చేరటానికిముందు, బాబు చదువు విషయమై తనుపడ్డ తాపత్రయం ... శ్రమకు ప్రతిఫలంగా బాబు చూపెట్టిన క్రమశిక్షణ ... కొంత వరకు తన ఆశయసిద్ధి...స్కూలునుంచి వచ్చేటప్పుడు కాని, వెళ్లేటప్పుడుకాని, చెఱువులోను, కాలవ లోను, స్నానాలు చేయటంకాని, ఈతలాడటం కాని చెయ్యనని బాబుచేత తన చేతిలో చెయ్యి వేయించుకోవటం... చెడుస్నేహాలకుపోకుండా జాగ్ర త్తగా మసులుకుంటానని బాబు యిచ్చిన వాగ్దానం ... అప్పటినుంచి యిప్పటివరకు బాబు నడవడిక ... మొదలైనవన్నీ తన మనః ఫలకంలో ఓ చిన్న సినీమా రీలులా తిరగటం ప్రారంభించాయి.

రాత్రి పదో, పదిన్నరో అవుతుంది. గ్రామం అంతా మాటుమణిగింది. ఆ వీధిచివర, ఎక్కడో అరుస్తున్న కుక్కధ్వని, పక్కింటివాళ్ళింట్లో గుఱ్ఱు తప్ప, జానికమ్మగారికి మరో ధ్వనేమీ వినిపించడం లేదు. ... ఇంతలో వీధిమెట్లు ఎక్కుతున్నట్లుగా అడుగుల చప్పుడు వినపడింది. బహుశా, బాబు అయివుంటాడని జానికమ్మగారు వూహించింది.

“అమ్మా” నెమ్మదిగా పిలుస్తూ, అతి నెమ్మదిగా తలుపు తట్టేడు బాబు. పిలిచేటప్పుడు బాబు కంఠం స్పష్టంగా వణుకుతోంది.

జానికమ్మగారు మెలుకువగావుండికూడ, బాబు పిలుపుకు సమాధానం యివ్వలేదు. ఇంత ఆలస్యంగా వచ్చినందుకుగాను బాబును నలిపిపడేద్దామా అన్నంత కోపంవచ్చింది ఆవిడకు.

“అమ్మా” తిరిగి కొంచెం గట్టిగా పిలచాడు. జానికమ్మగారు మాట్లాడలేదు. ‘తలుపు తియ్యవే అమ్మా’ అంటూ తలుపును గట్టిగా ఓతాపు తన్నేడు.

అయినా జానికమ్మగారు సమాధానం యివ్వలేదు. "అమ్మా! తలుపే" ఏడుస్తూ, తలుపు తట్టేడు.

జానికమ్మగారి కోపం పటాపంచలయిపోయింది. ఎంతకఠినంగా, కోపంగావుందామనుకున్నా 'అమ్మా' అని బాబు మృదువుగా, ప్రేమతో పిలచేటప్పటికి తన హృదయం వాత్సల్యంతో నిండిపోయింది. 'ఆ! వస్తూన్నా బాబు' ఎంతో ఆప్యాయతతో జవాబిచ్చి, లేచి తలుపుతీసింది.

'అమ్మా' అంటూ అధైర్యపడినబాబు, తల్లి కొడుతుందేమోనన్న భయంతో, గుమ్మంలో నిలుచుండే ఏడవటం ప్రారంభించాడు.

"అదేమిటిరా - అల్లా ఏడుస్తున్నావ్ ... ఆకలేస్తోందా? రా—లోపలికిరా—అన్నం తిందువుగాని" ఎంతో లాలనగా పిలచింది. గబగబా కాళ్లుకడిగి అన్నం పెట్టింది బాబుకు జానికమ్మగారు.

అదేమిటి? ఇంత ఆలస్యంగా వచ్చినందుకు అమ్మ నన్ను కూతలెయ్యలేదేమిటి? ... ఆఖరికి ఆలస్యంగావచ్చావేమిరా అనికూడ అడగలేదేంచెప్మా? పైగా ఎంతో సంతోషంతో అన్నంకలిపిపెడుతోంది కూడాను. బాబు ఆశ్చర్యపోయాడు. ... దెబ్బలు తప్పినందుకు బాబు చాల సంతోషించాడు.

భోజనం అయిన తరువాత రాత్రి పదకొండు గంటలకు, బాబు పుస్తకం పుచ్చుకుని లైటు దగ్గరకు చేరేడు. జానికమ్మగారు "ప్రొద్దుపోయింది ... అనవసరంగా మేలుకుని ఆరోగ్యం చెడగొట్టుకోకు. పడుకో" అనికూడ అనలేదు. మాట్లాడకుండా మంచంమీదపడుకుని తీక్షణంగా ఆలోచిస్తోంది.

బాబు, ఓ అరగంటసేపు చదువుకుని, పడుక్కుందుకు లేవబోయాడు. భయంతో తల్లికేసి చూశాడు, నిద్రపోతోందో, మెలుకువగా వుందోనని. బాబు మెల్లగా చప్పుడు చెయ్యకుండాలేచి, పుస్తకాలు పెట్టెలోపడేసి, లైటు చిన్నదిచేసి, మంచంకూడ చప్పుడవకుండా కూర్చున్నాడు. ఇంక పడుకోబోతు న్నాడు. ...

"ఒరేయ్! ఇల్లారారా" మంచంమీదపరుండే పిలచింది జానికమ్మగారు నెమ్మదిగా. ఆ పిలుపులో కాఠిన్యం స్పష్టంగా గోచరిస్తోంది.

బాబు భయంతోలేచాడు. ఏదో ఉపద్రవం రాబోతోందనే ఊహించాడు. వెళ్ళి తల్లి మంచం దగ్గర కూర్చున్నాడు చేతులుకట్టుకుని.

"అలా మంచంమీదకూర్చో" మంచంమీద కూర్చోమని కనురెప్పలతో సంజ్ఞచేసింది జానికమ్మగారు.

నదురుతూ, బెదురుతూ, బాబువెళ్ళి, తల్లి కాళ్ల దగ్గర కూర్చున్నాడు. అతని చూపులు చూస్తుంటే, ఏదో తప్పిదంచేసినట్టుగా కచ్చితంగా కనపడుతున్నాయి. "ఇంతవరకు ఎక్కడికి వెళ్లేవురా?" కోపంగా, అధికార స్వరంతో అడిగింది జానికమ్మగారు, బాబు కళ్లలోకిచూస్తూ.

బాబు, సమాధానం చెప్పటానికి భయపడి, తలకాయవంచేసుకున్నాడు. "ఎక్కడికి వెళ్లావ్?" తిరిగి హుూంకరించింది.

(సశేషము)

# స్వదేశంలో సేవచెయ్యడానికి తిరిగివస్తున్న భారతమహిళ



ఒక భారతయువతి తన భర్త 1941 లో గతించగా నర్సింగ్‌వృత్తి స్వీకరించి, ఉన్నత విద్య అభ్యసించాలని ఆశపడి చివరికి సాధించింది. ఎలాగో తంటాలుపడి అమెరికావచ్చి, బాస్టన్ యూనివర్సిటీలో చేరి, ఈ మధ్యనే నర్సింగులో బి. ఎస్‌సి. పట్టం పుచ్చుకున్నది.

ఆమెపేరు అవిళోలు గీవర్గీస్ కుంజమ్మ. నివాసం తిరువాన్కూరులోని కొట్టర్కూరు. నర్సింగ్ సైన్సు చదవడానికి నిశ్చయించుకొని, బాస్టన్‌యూనివర్సిటీలో రెండు సంవత్సరాలు విద్యాభ్యాసం చేసింది. ఆఖరాలు కాలంలో ఆమె ఇండియాకు తిరిగి వచ్చినప్పుడు బాస్టన్‌లో తనుచదువుకున్నది ఇతరులకు నేర్పుతుంది.

ఆమె చదువుకు 1953 - 54 సంవత్సరానికి అమెరికా ఆరోగ్య శాఖవారు స్కాలర్‌షిప్పు ఇచ్చారు. ఆయేడాది చదువు పూర్తిఅయి, గతసెప్టెంబరులో ఇంక నాలుగురోజులకు ఇండియాకు బయలు దేరుతుండనగా రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ స్కాలర్‌షిప్పు ఇవ్వబడినట్లు వర్తమానం వచ్చింది. దానితో ఆమెరెండవ ఏడాది చదువు పూర్తిచేసుకోగలిగింది.

పట్టం పుచ్చుకొన్న తరువాత ఆమె ఇలా చెప్పింది.

"నేను ఇక్కడ నేర్చుకొన్న చదువు మా దేశంలో చాలమందికి ఉపకరిస్తుంది. ప్రజల ఆరోగ్యాభివృద్ధికి మా దేశంలో చెయ్యవలసినపని బోలెడువుంది."

---

తిమ్మయ్యగారూ! బాగున్నారూ! "

"ఓరి నీ తస్సదియ్యా - నా పేరు నీకెలా తెలుసు"

"అట్లాగంటారేమిటి-మీ ముఖంచూస్తేనే తెలుస్తున్నది.

జి. ఆర్. రావు

# వీడ్కోలు విందు

కేసరి విద్యా సంఘ పరిపాలక వర్గంవారు మాజీ మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు, కేసరి విద్యా సంఘ కోశాధికారిగానుండిన శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారులా కమిషన్ మెంబరుగా ఢిల్లీలో నియమింపబడిన సందర్భమున ఈ నెల 10-వ తేదీన, సాయంకాలం కేసరి ఎలిమెంటరీస్కూలు ఆవరణలోని శ్రీ వెంకటేశ్వర హాలులో ఏర్పాటు చేసిన తేనీటి విందుకు మద్రాసు, ఆంధ్ర విద్యాశాఖ ఉన్నతాధికారులు, పోలీసుకమీషనరు, జస్టిస్ రాజగోపాలన్, యింకా అధికార, అనధికార ఆంధ్ర, తమిళ ప్రముఖులు, పత్రికారచయితలు అనేకులు హాజరయినారు.

ఈ సందర్భమున బాలబాలికలచే నిర్వహించబడిన నృత్యగాన ప్రదర్శనలు ముచ్చటగా నుండినవి.

---

# దుగ్గిరాల మహిళా సమాజం

## వార్షికోత్సవం

దుగ్గిరాల, ఆగస్టు 18 - అఖిల భారత మహిళా సభ స్థానికశాఖ వార్షికోత్సవం నిన్న కవయిత్రి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి అధ్యక్షతన వైభవోపేతంగా జరిగింది.

సమాజాధ్యక్షురాలు శ్రీమతి జంపాల రత్నమాణిక్యమ్మగారు స్వాగతం చెప్పారు.

కార్యదర్శినిచే నివేదిక చదువబడింది. శ్రీమతులు చెన్నఘంటమ్మ, కొండా పార్వతిగార్లు ప్రస్తుతం భారత దేశాభ్యుదయ కృషిలో స్త్రీల కర్తవ్యం చాలకలదని, అందు వారు చేయదగినదెంతయో కలదని వివరించారు. ఈ సమాజం ప్రస్తుతం ఏ సంస్థ సహాయంగాని, ప్రభుత్వ సహాయంగాని లేకున్నా చందాల మూలంగా ప్రజలనుండి ధనం కూర్చుకొని ప్రసూతి కేంద్రాన్ని నిర్వహించడం మిక్కిలి అభినందింపదగిన విషయమని పొగిడారు.

శ్రీమతి చెన్నఘంటమ్మగారు సమాజంకృషికి సంతసం వెలిబుచ్చుతూ సెప్టెంబరులో జరిగే వెల్ఫేర్ బోర్డు సమావేశంలో ఈ ప్రసూతి కేంద్ర విశిష్టతను తెలిపి తగినంత సహాయం చేసేట్లు ప్రయత్నిస్తామని అన్నారు.

సభాధ్యక్షురాలు "మానవసేవయే మాధవసేవ" అన్న తలంపుతో భారత నారీమణులు ప్రజాసేవకు గడంగవలెనన్నారు. తర్జన భర్జనలతో, వృధాగా కాలంగడిపితే మన దేశం వెనుకబడగలదని, ప్రస్తుతం భారత నారీలోకం దేశాభ్యున్నతి కార్యాలలో ముందడుగువేసి భారతదేశ మితర దేశాలకు ఆదర్శంగా వుండునట్లు చేయాలని ప్రోత్సహించారు.

నిరుడు ఆగస్టు 8-వ తేదీన నెలకొల్పబడిన ఈ సమాజం స్త్రీల విజ్ఞానాభివృద్ధికి, గృహపరిశ్రమల ప్రోత్సాహానికి కృషిచేసింది. ఈ సమాజం అయిదుగురు సభ్యురాండ్రతో ప్రారంభింపబడి సంవత్సరాంతానికి 139 గురు సభ్యురాండ్రను చేర్చగలిగింది. ఆదాయం రు 139-0-0. వ్యయం రు 116-2-9. గత జనవరి ఒకటవ తేదీని ప్రసూతి కేంద్రం ప్రారంభింపబడింది. చందా వసూళ్ళ జమ రు 3,433-0-0. ఖర్చు రు 892-3-3, నిలవ రు 2540-12-9.

ఈ కేంద్రాన్ని సర్వవిధ వైద్యాలకు తోడ్పడే ఉన్నత వైద్యాలయంగా చేయాలని ఈ సమాజం తలంచుచున్నది.




**శ్రీ సాయిబాబా : ఆలిండియా సాయి సమాజం, మద్రాసు 4 వారి ప్రచురణ. మూల్యము లేదు.**

నిస్పృహ, నిరాశలతో అయోమయావస్థలలోనున్నవారికి భగవత్ ధ్యానము, సేవ, స్మరణ ఆత్మ శాంతిని, ఆత్మ విశ్వాసాన్ని పూరిస్తుంటవి. ఇక దేవాంశ సంభూతులుగా అవతరించినవారు కష్ట నిష్ఠురాలకు గురియయి పతనావస్థలోనున్నవారి ఉద్ధరణకు పూనుకున్నప్పుడు మానవకోటి వారిని ఆరాధించడం, స్మరించడం, వారి లీలలను కీర్తించడము స్వాభావికము. అట్టి దేవాంశ సంభూతులలో శ్రీ సాయిబాబా ఒకరు. ఆ దివ్యమూర్తి కులమతవర్గ విచక్షణకు అతీతుడై తన జీవిత, బోధనల ప్రభావంతో పతనావస్థలో నున్నవారిలో ఆత్మ విశ్వాసాన్ని పూరింపజేసి, ఆశాకిరణాలను ప్రసరింపజేశారు.

ఇందులో శ్రీ సాయి భగవానునికి ప్రణామముచేయ ప్రబోధిస్తూ, పూజా, సంస్మరణల కనువైన పూజావిధి వివరించబడింది. భక్తి ముక్తి మార్గాలను ప్రబోధిస్తున్న యీ చిన్న పుస్తకము బహుళోపయుక్తముగా నుండగలదు.

**సెలయేరు: శ్రీ నేదునూరిగంగాధరం. ప్రచురణ కర్తలు : దేశోద్ధారక గ్రంథమాల 3-5-1027, నారాయణగూడ, హైదరాబాద్ (డ) వెల రు. 1-12-0.**

ఇదిజానపదగేయాల సంపుటి. ఇందలి గేయాలను గ్రంథకర్త ఏడుభాగాలుగా విభజించి వానికి బాల సారస్వతము, స్త్రీ సారస్వతము, ఉత్సవములు, భక్తి సారస్వతము, గృహజీవన, సారస్వతము శృంగార సారస్వతము, పారకజన సారస్వతమని నామకరణంచేశాడు.

ఇందలి పాటలు ప్రతియొక్కటి సహజంగా సామాన్య ప్రజానీకం పాడుకొంటున్నవి. అయినా విజ్ఞానాన్ని వినోదాన్నికూరుస్తూ, భక్తి, శృంగారరసాలను పూరిస్తూప్రబోధనాత్మకంగానున్న యీ గేయాల సేకరణలో జరిపిన కృషి ప్రశంసనీయము. ఇందలి చిత్రాలు ప్రత్యేక ఆకర్షణ.

**శ్రీ హరినాథ భగవానుడు: శ్రీ అరటకట్ల బ్రహ్మం. ప్రచురణ కర్తలు: ది కుసుమ్ హరనాధ్ సెంట్రల్ మిషన్, రాజమహేంద్రవరము. వెల రు. 1-0-0.**

భారత దేశంలో జన్మించిన పుణ్యపురుషులలో శ్రీహరనాధ్ భగవాన్ ఒకరు. వారి జీవితవిశేషాలను, బోధనలను పొందుపరచబడినదీ గ్రంథము. ఇందులోని విషయాలు ఆంధ్ర, వంగ భక్తులరచనలనుండి సేకరించబడినవి. శ్రీ హరనాధ్ జీవితమును సంబంధించిన అనేకనూతన విషయములతో రూపొందిన యీ గ్రంథము పాఠకులను ఉత్సాహపరచుచుండును.

# సంపాదకీయములు

## జాతీయ భాషగా హిందీ

దేశం మొత్తానికి పరిపాలనా సౌలభ్యానికి, వివిధ రాష్ట్ర ప్రజానీకం ఒకరినొకరు అర్థంచేసికొని సమైక్యంగా వ్యవహరించడానికి జాతీయ భాషయొక్క ఆవశ్యకతను ప్రతి భారతీయుడు గుర్తించాడు. హిందీ దానికని నిర్దేశించబడింది. అయితే పరిపాలనా నిర్వహణలోను, దేశం ఉమ్మడి వ్యాపార సాహారాలు, ఉన్నత విద్యా విధానములోను అమలునందున్న ఆంగ్లభాష ఎంత కాలంలో నిష్క్రమించాలి? దాని స్థానంలోకి హిందీ రావడానికి ఎంతకాలం వ్యవధి పట్టాలి? అనేది యీనాటి సమస్య.

ఆంగ్లము విదేశీయ భాషే కావచ్చును. ఆంగ్ల పరిపాలన క్రింద భారతీయులు కష్టనష్టాలకు గురియయి యుండవచ్చును. అంతమాత్రం చేత ప్రపంచ వ్యాప్తంగా ఉత్తమోత్తమ విశిష్టతను సంపాదించుకొని ప్రపంచ భాషగా రూపొందిన ఇంగ్లీషును మనము ద్వేషించడం అవివేకము కాగలదు. హిందీ అయితే యీనాడు కాకపోయినా రేపయినా జాతీయభాష కావచ్చు; అవుతుంది. కాని ప్రపంచములో ఇంగ్లీషుకున్న స్థానం హిందీకి మాత్రం ఏనాడు రాదు. భారతదేశ అంతర్జాతీయ రంగంలో సన్నిహిత సంబంధ బాంధవ్యాలు కలిగియుండటానికిగాని, ప్రాక్పశ్చిమ దేశాల సమస్యలను, అచ్చట పరిస్థితులను, పరిణామాలను గుర్తించి అర్థంచేసికొని వ్యవహరించడానికి ఆంగ్లము యీనాడే కాదు — రానున్న తరతరాలకుకూడ అవసరమే. కాబట్టి ప్రాంతీయ, జాతీయ భాషలతో బాటు ఇంగ్లీషు సయితం విద్యావిధానములో రూపొందియుండి తీరాలి.

## నిరుద్యోగ సమస్య — పరిశ్రమలు

నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి పరిశ్రమల స్థాపన దోహదం చేయవచ్చును. కాని ఆపరిశ్రమలు భారీ యంత్ర పరిశ్రమలా లేక కుటీర పరిశ్రమలా అనేదే ఆలోచించ వలసినది.

కుటీర పరిశ్రమల ద్వారా అత్యధిక సంఖ్యాకులకు వృత్తి కల్పించ నవకాశముండి, అందలి వుత్పత్తులు క్రమంగానైనా నాణ్యంగా తయారు కాగలప్పుడు వానిని ప్రోత్సహించి జాతీయావసరాలను తీర్చడం మంచిది. విదేశములతో వర్తక వ్యాపారాలకు భారీ పరిశ్రమల స్థాపన, ఉత్పత్తి చేయడం మంచిది.

భారీ యంత్ర పరిశ్రమలకంటె కుటీర పరిశ్రమలు ఎక్కువమందికి వృత్తులను కల్పించి నిరుద్యోగ పరిష్కారానికి తోడ్పడ గలవు. ధనవంతులైన పారిశ్రామిక వేత్తలు యీ విషయాన్ని గుర్తించెదరుగాక!

## శ్రీ మన్మథనామ సం॥ర భాద్రపదమాసము

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ సెప్టెంబరు నెల | 16 | శు | ● అమా 12-54 పూఫ 2-45 |
| | 17 | శ | శు.పా 12-6 ఉఫ 3-28 |
| | 18 | ఆ | విది 12-33 హ 5-23 భానువిదియ, కల్కి జయంతి, అమృతసిద్ధియోగం |
| | 19 | సో | తది 14-9 చి 8-28 గౌరీవ్రతం |
| | 20 | మం | చవి 16-48 స్వా 12 36 పంచమితిధిః, సిద్ధివినాయకవ్రతం |
| | 21 | బు | పం 20-19 విశా 17-29 శూన్యతిథి, బుద్ధజయంతి |
| | 22 | గు | ష 24-28 అనూ 23-3 దగ్ధయోగం |
| | 23 | శు | స 29-0 జ్యే 28-59 దేవీపూజనం, తిరుపతి వెంకటేశ్వరస్వామివారి గరుడోత్సవం |
| | 24 | శ | అ 33-36 మూల 34-58 దూర్వాష్టమి |
| | 25 | ఆ | న 38-3 పూషా 40-48 త్యా 4-24 |
| | 26 | సో | ద 62-8 ఉషా 46-11 |
| | 27 | మం | ఏ 45-21 శ్రవ 50-53 వామన జయంతి |
| | 28 | బు | ద్వా 47-42 ధ 54-41, సిద్ధియోగం |
| | 29 | గు | త్ర 48-57 శత 57-21 త్యా 4-11 |
| | 30 | శు | చతు 49 2 పూభా 58-53 అనంతపద్మనాభవ్రతం |
| 1955 సం॥ అక్టోబరు నెల | 1 | శ | ○ పౌ 47-37 ఉభా 59-6 ఉమామహేశ్వరవ్రతం, ఆంధ్రరాష్ట్రావతరణోత్సవదినం |
| | 2 | ఆ | కృ పా 45-9 రేవ 58-6 మహాలయపక్షారంభం |
| | 3 | సో | వి 41-34 అశ్వ 55-58 త్యా 3-52 |
| | 4 | మం | త 36-53 భ 52-50 |
| | 5 | బు | చవి 31-25 కృ 49-6 త్యా 3 44 |
| | 6 | గు | పం 25-20 రో 44-34 శుక్రమౌఢ్యరహితః |
| | 7 | శు | ష 18-54 మృ 39-56 |
| | 8 | శ | స 12-28 ఆర్ద్ర 35-23 |
| | 9 | ఆ | అ 6 9 పున 31-6 |
| | 10 | సో | న 0-26 ఏవ్యం 54-38 పుష్య 27-23 |
| | 11 | మం | ఏ 50-43 ఆశ్రే 24-33 స్మార్తైకాదశి |
| | 12 | బు | ద్వా 47-32 మ 22-36 మఘాశ్రాద్ధం |
| | 13 | గు | త్ర 45-42 పూఫ 21-48 |
| | 14 | శు | చతు 45-0 ఉఫ 22-13 |
| | 15 | శ | ● అమా 45-28 హ 23-5 మహాలయ అమావాశ్య - పిండపితృయజ్ఞః |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



ప్రెసిడెంటు టిటో ఆహ్వానాన్ని స్వీకరించి యుగోస్లావియాను సందర్శించిన సందర్భమున ఉభయపార్లమెంటు చేంబరుల సంయుక్త సమావేశంలో పండిత నెహ్రూ ఉపన్యసిస్తున్న దృశ్యము.

